భారతీయ సాహిత్య నిర్మాతలు

# కేశవసుత్

మూలము :

ప్రభాకర్ మాచ్వే

తెలుగుసేత :

యస్. సదాశివ




సాహిత్య అకాడెమి

న్యూఢిల్లీ

# విషయసూచిక

—o—

# ఉపోద్ఘాతము

ఉర్దూ మాటలాడు వారికి హాలీ ప్రసక్తి వలన, బెంగాలీలకు మైకేల్ మధు సూదన దత్త ప్రసక్తి వలన, తమిళులకు సుబ్రహ్మణ్య భారతి ప్రసక్తివలన, గుజ రాతీయులకు నర్మద్ ప్రసక్తివలన, ఎట్టి ఆదర భావము కలుగునో అట్టిదే మరాఠీ సాహిత్యాభిమానులకు కేశవసుత్ ప్రసక్తి వలన కలుగును. ఈ మహాకవులందరును తమ తమ భాషలలో నవ్యకవితకు నాంది పలికినవారు. వారు వాగ్గేయ కారులే కాక కావ్యభాషను, కావ్యశైలిని, ప్రాతపడిన సాంప్రదాయిక పథము నుండి మరల్చి క్రొత్తబాటలలో పురోగమింపజేసిన మహాకవులు. ఈ శతాబ్దపు భారతీయ సాహిత్య చరిత్రలో మైలు రాళ్లవంటివారు. పాశ్చాత్య సంస్కృతి, జాతీయ చైతన్యము నెట్లు ప్రభావితము చేసెనో వారి రచనల వలన స్పష్టపడును.

సాహిత్య చరిత్రలో మహాకవులు అజ్ఞాతముగా, అనామకముగా మరణించిన సంఘటన లనేకముగా కవిపించును. నేడు వారిని గురించి మనకు తెలిసినది స్వల్పము. కాళిదాసు కాలము నేటికిని నిర్ధారింపబడలేదు. ఉమర్ ఖయ్యామ్ రుబా యీలు ఇంతవరకు అన్నియు బయట పడలేదు. హోమర్ జన్మస్థానమని ఏడో, తొమ్మిదో నగరములు తలంపబడుచున్నవి. ఏది సరియైనదో తెలియదు. కేశవసుత్ ఇటీవలి కవియే-అతని జన్మతిధిని గురించి యైనను ఏకాభిప్రాయము కుదురలేదు. ఈమరాఠీ మహాకవికి సంబంధించిన అవశేషము, అతని మరణానంతరము ముద్రిత మైన నూటముప్పదిరెండు కవితల చిన్నపాటి సంకలనము మాత్రమే.

కేశవసుత్ కవితా విశిష్టతను గ్రహించుటకై కీ. శే. కుసుమావతీ దేశపాండే గారి ఆంగ్ల గ్రంథము (History of Marathi Literature, ఈ గ్రంథమును సాహిత్య అకాడెమీ త్వరలో ప్రచురింపనున్నది ) నుండి కొన్ని పంక్తులిట ఉద్ధ రించుట సమంజసము:

"మరాఠీ నవలా రచనలో హరినారాయణ ఆప్టే ఏమి సాధించెనో, మరాఠీ కవితకు నిర్మాణశక్తి కలిగించి కేశవసుత్ అదియే సాధించెను. దేశీయములును, విదేశీయములును అగు ప్రతిధ్వనుల ప్రపంచములో కేశవసుత్ ధ్వని విస్పష్టమైనది. అతడును కొంతకాలము సాంప్రదాయిక శైలిలో కవితారచన చేయుటకు అభ్యాసము

చేసిన వాడే. అయినను, భావ వ్యక్తీకరణకై తన ప్రత్యేక శైలిని ఏర్పరచుకొనిన నాటినుండి అతడు మరారీ కవితలో నూత్నశకము నారంభించిన వాడయ్యెను.

అతని ప్రారంభ కవిత నేడు అలభ్యము. అల్పవయస్సునుండియు అతడు సాంప్రదాయిక ఛందోరీతులలో వర్ణనాత్మకముగానో, నీతిబోధకముగానో చక్కని కవిత వ్రాయుచుండు వాడందురు. లభ్యమైన అతని తొలిరచన రఘువంశ కావ్యము నందలి ఒక భాగమునకు 1885 వ సంవత్సరమున చేసిన అనువాదము. అతని ప్రణయ కవిత సంస్కృతమునందలి శృంగార రసాత్మక కావ్యముల ప్రభావమును వెల్లడించును. అతని శైలియును, కల్పనయు, సంస్కృత కవిత్వపు మూసలోను, సంస్కృతచ్ఛందోలంకార భూయిష్ఠమును శృంగారరసనిరూపితమునగు సాంప్రదాయికమైన మరారీ కవిత్వపు మూసలోను, పోసినట్టివి. తరువాత అతడు నిత్య వ్యవహారములోలేని. కావ్యభాషావిరుద్ధములగు పదము లెన్నింటినో ఉపయోగించు సాహసము చేసెను. కేశవసుత్ సంస్కృత శ్లోకమును 'ఓడ్' వలె పొదిగించి నూత్నశక్తి కలిగించెను. అతడు తెచ్చిన గొప్ప మార్పు కవితను ఆత్మాశ్రయము చేయుట – భావనలో అపూర్వమగు ఆత్మవిశ్వాసము, కవితాప్రయోజనము నిరూపించుటలో క్రొత్తబలము, భావవిశదీకరణములో సాటిలేని నిజాయితీ అతని కవితలో కనిపించు విశిష్ట లక్షణములు. అతడు క్రొత్తరకపు 'లిరిక్కు'కు జన్మదాత అనుట నిక్కము.

ఆంగ్లకవిత్వ ప్రభావమే ఈ పరివర్తనకు ముఖ్యకారణ మనవచ్చు. అంతకు పూర్వమే కుంటే, మహాజనీ మొదలగువారి రచనలు ఈ ప్రభావమునకు బాటలు వేసినవి. కాని అది ఇట పాదుకొనలేక పోయినది. కేవలము అనువాదములవరకు, అనుకరణలవరకు నిలిచిపోయినది. కేశవసుత్ కూడ కొన్ని ఆంగ్ల కవితలను అనువదించెను. అందులో కొన్ని అనువాదములనుట కంటె అనుసరణ లనదగి యున్నవి. అతడు అధ్యయనము చేసినంతమేర ఆంగ్లకవిత, పరిణతమగు సాహిత్యాభిరుచిని పెంపొందించి ప్రత్యేకశైలి నేర్పరచుకొనుటకు తోడ్పడిన దనిపించును.

'కావ్యరత్నావళి' వంటి సమకాలిక సాహిత్యసంచికలో కేశవసుత్ వ్రాసిన ఏదేని కవితను చూచుట మరుభూమిలో సుందర పుష్పమును చూచుటయే. అతని కవితలన్నియు ఉద్వేగ్తగా లేచిన గృహసంబంధస్మృతులు, సంస్కృతద్వారమైన మిత్రగృహదర్శనము, ప్రేమించినవారి యెడబాటు, కవితాతత్త్వ పర్యాలోచనము మున్నగు వ్యక్తిగతానుభూతులవలన రూపొందినవి. ప్రకృతిని గురించి అతని భావన నవ్యము. పక్షుల గీతములలో పరపు సంగీతములో అభివ్యక్తమగు ప్రకృతి కవితకు సరియైన కవిత ఏ కవియు చెప్పలేడని అతని అభిప్రాయము. ప్రకృతి కవిత నిత్య

నూతన సౌందర్య విలసితము. అత్యధిక వర్ణనలులేక అలతి యలతి మాటలలో అలరారు అతని కవిత రసానుభూతిని కలిగింపగలిగి యుండుటకు అతనిలోని చైతన్యము, తాదాత్మ్యమును కారణము లనవచ్చును. అతని కవితలలో ప్రకృతి వర్ణనాత్మకములే శ్రేష్ఠమైనవి. వానిలో అనేకములు వర్డ్స్ వర్త్ కవితలవలె సరళతయు, ధ్యానముద్రయు కలవి.

అగర్కార్ ప్రభావము వలన గానోపు. కేశవసుత్ సర్వమానవ సమానత్వమును, సంఘసంస్కరణావశ్యకమును ఉద్ఘాటించెను. అతడు హరిజన బాలుని గురించియు, పస్తులుండు కార్మికుని గురించియు హృదయమును కదలించు కవితలు వ్రాసెను. శక్తివంతములును, సుప్రసిద్ధములును అగు అతని కవితలలో 'తుత్తారీ' ఒకటి. అది సాంఘిక దుర్వ్యవస్థను, మూఢ సంప్రదాయములను పరాస్తము చేయుటకై ఒత్తిన శంఖము. 'నవసిపాయి' అను కవిత కూడ అట్టి ఆవేశావేశములు కలదియే.''

కేశవసుత్ శ్రేష్ఠకవితలన్నియు ఆలోచనాత్మక ధోరణి కలవి. అవి సృష్టి శక్తియొక్క రహస్యశోధనకై ప్రయత్నించును. ఏకాంతానుభూతిని కలిగించి ఆధ్యాత్మిక సౌధము నన్వేషింప జేయును. అవన్నియు అవ్యక్తమును అనిర్వాచ్యమును అగు తత్త్వము పట్ల ప్రగాఢజిజ్ఞాసను ప్రకటించును. అట్టికవితలలో 'జపుర్జా' ఒకటి. సాంప్రదాయికముగా బాలికలు ఆడుకొను 'జిమ్మా' (చెమ్మ చెక్క వంటి ఆట) అను ఆటలో మాటిమాటికి ఉచ్చరించు పదబంధము (జా-పోరి-జా) యొక్క సంక్షిప్తీకృత రూపము (జపుర్జా) ఆశీర్షిక. బుద్ధియొక్క సృజనాత్మక శక్తిని, దాని అనుభూతుల అవధులను, నక్షత్రమండలికి అవ్వలి వరకు వ్యాప్తమైన విశ్వముతో దానికి గల అనుబంధమును వివరించు ప్రయత్నమందు జరిగినది. 'హరప్లేశ్రేయ' అను కవితలో కవి తానేదో వింతలోకమున లీనమై పోయిన భావమును. సర్వసృష్టికి విలయమైన దానిని పొందుటకై పడు తీరని తపనను వెల్లడించును. వర్డ్స్‌వర్త్ వ్రాసిన "Ode to intimations of Immortality" ముద్రగల కవిత అది. అయినను అనుకరణము మాత్రము కాదు. కేశవసుత్ వ్రాసిన తాత్త్వికకవితలు పాశ్చాత్య కవితలు పాశ్చాత్యకవుల భావనా విధానమునకును, భారతీయుల వేదాంత తత్త్వమునకును గల అనుబంధమును వివరించును.

భారతదేశమున పందొమ్మిదవ శతాబ్దిలో నారంభమై టాగూరువలన 'పరాకాష్ఠనందిన నవచైతన్యమునకు ముఖ్యాంగములు మూడు. కవిత కేవల నీతి బోధకమగు ప్రమాదమున్నను, ప్రకృతి యెడ పరతత్త్వదృష్టి, మాతృదేశ విముక్తికై తీవ్రాకాంక్ష, సాంఘికాన్యాయచ్ఛేదనమునకై మానవతావాద ప్రకటనమును అనునవి. కేశవసుత్ కవితలో ఈ మూడును సమ్మిళితమై యున్నవి. కుతూహల జనకమగు పీయన కవితానౌక ఉపనిషత్తులనుండియు, కాళిదాసునుండియు ప్రాచీనతాస్ఫూర్తిని పొంది, వర్డ్స్ వర్త్, షెల్లీ, బ్రౌనింగులను ధ్రువతారలుగా భావించి పయనించినది

## జీవితము

కేశవసుత్ జన్మతిథియు, జన్మస్థలమును వివాదాస్పద విషయములై యున్నవి. అతని తమ్ముడు సీతారామ్ కేశవ్‌దామ్లె తొలుదొల్త అతని జీవిత చరిత్ర వ్రాసెను. అతడు తన చెంతనున్న జన్మపత్రిక ఆధారముగా, కేశవసుత్ జన్మతిథి 15 వ మార్చి 1866 కు సరియగు ఫాల్గుణ బహుళ చతుర్దశి శ. సం. 1587 అని నిర్ణయించెను. ఈ తిథి నిర్ణయము పలువురి ఆక్షేపణలకు గురియయ్యెను కొందరు జన్మపత్రిక తప్పను చున్నారు. కొందరు, భారతీయ పంచాంగ పద్ధతిప్రకారము అధికమాస గణనచేసి. శకతిధితో సరిచేసిన ఆంగ్లతిథి తప్పనుచున్నారు కేశవసుత్ కవితలను. వరుసగా ప్రచురించిన 'కావ్యరత్నావళి' అను కవితా పత్రిక డిసెంబర్ 1905 నాటి సంచికలో అతని మరణవార్తను ప్రకటించుచు అతడు మార్చి 1866 న జన్మించెనని తెల్పినప్పటికి, జనవరి 1906 నాటి 'మనోరంజన్' పత్రికలో ఆ మాటయే పునరుక్తము చేయబడినప్పటికిని, కొందరు ప్రామాణిక విద్వాంసులు కేశవసుత్ 7 వ అక్టోబర్ 1866 న జన్మించెనని అభిప్రాయపడుచున్నారు. కాబట్టి సరియైన తిథినిర్ణయము జరుగనప్పటికిని అతడు 1866 వ సంవత్సరమున జన్మించెననుట నిర్వివాదము. శ్రీమతి విజయా రాజాధ్యక్ష్ మార్చి 1966 'సత్యకథ' పత్రికలో ఈ విషయమును సాకల్యముగా సమీక్షించి, అతని జన్మతిథిని గురించిన లిఖితాధారమేదియు లేదని తేల్చెను. బహుశా కవికే తన జన్మతిథి తెలిసియుండదని ఆమె అభిప్రాయపడెను.

అతని జన్మస్థలమును గురించియు, అతని మృత్యువును గురించియు ఇట్టి వివాదమే ఉన్నది. అతని జీవిత చరిత్ర వ్రాసిన వారనేకులు, మహారాష్ట్రమందలి కోంకణ జిల్లాలోని రత్నగిరి సమీపమున గల 'మాల్గుండా' గ్రామమునందు అతడు జన్మించి నట్లు తలంచుచున్నారు. కాని స్కూలు రికార్డులో కవి స్వహస్తములతో తన జన్మస్థలము 'దాపోలీ' జిల్లాలోని 'వళ్నే' గ్రామమని నమోదుచేసెను. ఇటీవల మహారాష్ట్ర ప్రభుత్వము అతని జన్మస్థానములో తగురీతిగా స్మృతిచిహ్న స్థాపనకై సమాలోచించుటకు ఒక సమావేశము ఏర్పరచెను అందు అతని జన్మగృహమని చెప్పబడు దాని ప్రామాణికత తీవ్రముగా ఆక్షేపింపబడెను.

అతడు 39 ఏండ్ల లేత్రాయమున, హుబ్లీలో, 7 వ నవంబర్ 1905 న మధ్యాహ్నము ప్లేగు వలన మరణించెననియు, అతని భార్య ఎనిమిది దినముల తర్వాత, అనగా 15 వ నవంబర్ 1905 న మరణించెననియు ఇప్పుడు నిర్ధారితమైనను. శ్రీ ఎన్. ఎస్. రాహాల్కర్ 2 వ నవంబర్ 1905 న అతడు మరణించి

నట్లు ఒకానొక సంతాప వ్యాసమున వ్రాసెను. కేశవసుత్ కంటె పండ్రెండేండ్లు చిన్నవాడును, జీవిత చరిత్ర కారుడును అగు అతని తమ్ముడు, "కేశవ్ సుతాంచీ కవితా" అను గ్రంథము యొక్క రెండవ ముద్రణమునకు అనుబంధముగా తొలి సారి అతని జీవిత చరిత్రను సంగ్రహించుచు ఆ తప్పుడు తేదీనే ఉట్టంకించెను. తర్వాత కేశవసుత్ సోదర పుత్రుడు శ్రీ పరశురామ చింతామణ్ దామ్లే పై గ్రంథము నాలుగవ ముద్రణమున ఆ తప్పును సవరించెను. కనుక కేశవసుత్ మరణ తిథి 7 వ నవంబరనుట నిర్ధారితము.

అతని కవితలలో రెండు చోట్ల అతని జన్మస్థలమును గురించిన సూచన లున్నవి. 'నైఋత్యే కడీల్ వారా' (నైఋతి దిక్పవనము) అను కవితలో అతడు తన గ్రామము మాల్గుండాను మాల్యకూటముగా సంస్కృతీకరించెను. 'ఏక్ ఖేడే' (పల్లెటూరు) అను కవితలో అతడు వర్ణించిన గ్రామము ప్రకృతి పరిసరముల ననుసరించి 'వళ్ణే' ను పోలి యున్నదని విమర్శకులు అభిప్రాయ పడుచున్నారు.

"ఎన్నో ఓడలు, తెప్పలు సముద్ర జలమున తేలియాడు చున్నవి." అను సందర్భము ఆ విషయమును సమర్థించుచున్నది.

శ్రీ పి. సి దామ్లే చూపిన వంశ వృక్ష మిది:



దామ్లేలు చితపవన కొంకణస్థ బ్రాహ్మణులు. వారు మొదట రత్నగిరి దగ్గరి
కోలంబే గ్రామవాసులు. కేశవసుత్ తండ్రి పేరు కేశవ్ విట్ఠల్. వ్యవహార నామము
కేశోపంత్ దామ్లే. అతడు తన మరాఠీ చదువు ముగించుకొని వంశక్రమాగతమైన
వ్యవసాయమును గాక ఉపాధ్యాయ వృత్తిని అభిమానించెను. పదునైదేండ్ల వయ
సున కేశవసుత్ తండ్రి ఉపాధ్యాయ వృత్తిని అవలంబించెను. ప్రభుత్వ విద్యా
శాఖలో ఉద్యోగము చేయుచు మూడు రూపాయలనుండి ముప్పది రూపాయల మాస
వేతనము వరకు అతడు ఉన్నతి చెందెను. ఆరోగ్యము సరిగా లేనందువలన అతడు
పది, పదొకండు రూపాయల ఉపకార వేతనముపై ఉద్యోగ విరమణ చేసెను. ఆ
తర్వాత అతడు వళ్నెలోని విశ్వనాథ్ మాండలిక్ భూసంబంధ వ్యవహారములను
పర్యవేక్షించెను. మాండలిక్ సుప్రసిద్ధ దేశభక్తుడు. భూస్వామి. దామ్లేల కుటుంబ
మిత్రుడు. కేశవసుత్ "సింహావలోకణ" అను తన కవితలో "వళ్నె" గ్రామమును
పేర్కొనెను. ఆ కవిత వర్డ్స్‌వర్త్ వ్రాసిన 'The Prelude' ఛాయలో వ్రాయ
బడినది.

కేశోపంత్ ఆదాయము స్వల్పమైనను అతడు హాయిగా, అప్పులు లేకుండ
గడపెను. క్రమ శిక్షణకు, నిజాయితీకి, ఆత్మశక్తికి అతడు విఖ్యాతుడు. కేశవసుత్
తన కవితలలో తండ్రియెడ చాల గౌరవ ప్రేమలు ప్రకటించెను. కేశోపంత్ 1883
లో మరణించెను.

కేశవసుత్ తల్లి మల్డోలీ జమీందారులగు కరందీకరుల యింట బుట్టినది.
తన తలి దండ్రులకు ఆమె ఏకైక సంతానము. ఆమె ఉజ్జయినిలో 1902 న మర
ణించెను. భావుకత, ఆస్తికత్వ, విశాల హృదయత, ఉదారమగు మానవతావాదము
అతనికి తన తల్లినుండియే సంక్రమించినవి. ఆమె మరణించినపుడు అతడు శోక
విషాద కవిత వ్రాసెను.

కేశవసుత్ తన తలిదండ్రుల నాలుగవ సంతానము. అతని సోదరులు ఐదు
గురు. తోబుట్టిన ఆడు పడుచులు ఆరుగురు. అతని అగ్రసోదరుడు తన పదునొకం
డవ యేట నీటమునిగి మరణించెను. రెండవ అన్న శ్రీధర్. అతడు విద్యార్థిగా
నున్నప్పుడే మేధావి. రత్నగిరిలో హైస్కూల్ పరీక్షయందు ప్రథముడుగా ఉత్తీర్ణు
డయి జగన్నాథ శంకర్ సేఠ్ స్కాలర్‌షిప్పు పొందెను. 1882 సంవత్సరమున
ఎల్ఫిన్‌స్టన్ నుండి బి. ఏ. పట్టా పొంది, బరోడాలో క్రొత్తగా స్థాపితమైన కాలేజీ

యందు సంస్కృతాచార్యుడుగా నియమితుడయ్యెను. కాని, ఒక సంవత్సరములోగానే, జనవరి 1883 లో అతడు టైఫాయిడ్ వలన మరణించెను.

కేశవ సుత్ బాల్యమున చదువు సరిగా సాగలేదు. రత్నగిరిలోని 'ఖేడ్' అను గ్రామమున తన చిన్న తమ్మునితో కలిసి ప్రాథమిక విద్య అభ్యసించెను. ఆంగ్లములో ఉన్నత విద్య పొందుటకై అన్నదమ్ము లిరువురును బరోడాకు వెళ్లిరి. ఆనాటి ఆచారము ప్రకారము ఇరువురికిని చిన్నతనముననే వివాహమయ్యెను. వివాహ మగు నప్పటికి కేశవ సుత్ వయస్సు పదునేనేండ్లు. అతని తమ్ముని వయస్సు పదమూడేండ్లు. కేశవ సుత్ భార్య రుక్మిణీ బాయి చితళే వంశమునకు చెందినది. వివాహమగు నప్పుడు ఆమె వయస్సు ఎనిమిదేండ్లు. ఆమె దయగలది. కష్టపడి పనిచేయునది. చెప్పుకోదగిన రూపవతికాదు. అంతకు మించి ఆమెను గురించి ఇంకేమియు తెలియదు. ఆ భార్యా భర్త లిరువురును సిగ్గరులు. అందరితో కలుపుగోలుగా మెలగువారుకారు. కేశవ సుత్‌కు ముగ్గురు కుమార్తెలు. మనోరమ, వత్సల, సుమతి అని వారి పేర్లు. 'మహతారీ' అను కవితలో కేశవ సుత్ తన రెండవ కుమార్తెను ప్రస్తావించెను. అతని మామ కేశవ గంగాధర చితళే ఖాందేశ్ జిల్లాలోని చాలీస్‌గాంవ్ మరాఠీ ఉన్నత విద్యాలయమునకు ప్రధానోపాధ్యాయుడు.

అతని బాల్యమును గురించి అంతగా తెలియదు. అతడు శారీరకముగా బలహీనుడు. ఎప్పుడును సణుగుకొనువాడు. పౌరుష ప్రధానములగు ఆటలలో శరీర బలహీనత కారణముగా పాల్గొను వాడు కాడు. ఒంటరిగా చాలదూరము వాహ్యాళి వెడలుట అతనికి మక్కువ. మాటలాడుటలో పొదుపరి. ఒకింత చపల చిత్తుడని అతని తల్లి అభిప్రాయము. అతని మూర్తి యెట్టిదో తెల్పుటకు ఎట్టి ఆధారమును లేదు. కాని అతని కొందరు మిత్రుల మాటల ననుసరించి, 'అతని ముఖము ఆలోచనా దీనము-గంభీరము' (కిరాత్) 'ఇతరులతో మాటలాడు నపుడు అతడు సాధారణముగా క్రిందికి చూచువాడు. ఎప్పుడయిన కనులెత్తినేని అతని చూపులు తీక్ష్ణమైనవి. '(వినాయక్, ఎస్. కరందీకర్) అతని ఎత్తు ఐదడుగులో, మరికొంచెము ఎక్కువో.' (గద్రే) అతని శరీర వర్ణము స్వచ్ఛము. ముఖము గుండ్రనిది. నొసట ఎప్పుడును ముడుత లుండెడివి. అట్టి విన్నబోయిన ముఖమును చూచి అతని ఉపాధ్యాయు డొక సారి మందలించెను. 'దుర్ముఖ్ లేలా' (ఖిన్నవదనుడు) అను కవితలో కేశవ సుత్ ఇట్లనును ;

"అతని వదనము ఖిన్నమైన నేమి? దివ్య ప్రతిభతో అతడు గానము చేయు కవిత ప్రపంచ మంతటికిని, ప్రజలందరకును ఆనందము కలుగ చేయును. అతని

వాడీన ముఖమునుండి భవిష్యత్తులో సుందరమును, శాశ్వతానందదాయకమును అగు కవితా మృతము వెల్లి విరియగలదు. నీవు కాదేని నీ సంతానము తత్పానమున ఆనందము పొందును. కవి ముఖము ఎట్లుండెనని ఎవరును ప్రశ్నింపరు." 1886 అతడు ఫోటో తీసికొనక ఉపేక్షించుటకు కారణ మదియే. నేడు అతని సోదరుల ఫోటోలు లభించును. కాని, జీవిత కాలమున తీసిన అతని ఫోటో కాని, గీసిన రేఖా చిత్రముకాని లభించదు. ఫిలాసఫీ ప్రొఫెసరుగా పనిచేయుచున్న అతని సోదరు వింట ఒకసారి అతని కుటుంబ మంతయు కలిసి కొనినది. గ్రూప్ ఫోటో తీయించుకొను టకు నిర్ణయించినది. కేశవ సుత్ అందులో చేరలేదు.

ప్రాథమిక విద్య అభ్యసించునపుడు అతడు చాల హింసను అనుభవించి యుండును. అతని ఒక కవితలో ఆనాటి ఉపాధ్యాయులు పిల్లలను క్రూరముగా హింసించుట వర్ణితము. అది అతని హృదయమున మాయని గాయమై యుండి పోయినది.

1882 వ సంవత్సరమున అతడు బరోడాలో నున్న తన అన్న శ్రీధర్ కేశవ్ దగ్గరికి వెళ్లెను. శ్రీధర్ పట్టపరీక్షలో ప్రథమ శ్రేణియందు ఉత్తీర్ణుడై సంస్కృ తముతోను, లెక్కలలోను ప్రొఫెసర్‌గా పనిచేయు చుండెను. దురదృష్టవశమున కేశవ సుత్ అక్కడ ఎపి మిది మాసములకు మించియుండలేక పోయెను. ఎందు కనగా శ్రీధర్ తన ఇరువది మూడేండ్ల లేత వయసున, పట్ట పరీక్షలో ఉత్తీర్ణుడైన ఒక సంవత్సరముననే, టైఫాయిడ్ వలన మరణించెను. అది ఆ కుటుంబమునకు పెద్ద దెబ్బ - తరువాత, వార్ధాలో ప్లీడరుగానున్న తన మేనమామ శ్రీరామచంద్ర గణేశ్ కరందీకర్ దగ్గరనుండి కేవశ సుత్ చదువు సాగించెను. అప్పుడు వార్ధాలో ఆంగ్ల బోధనకు సరియైన సౌకర్యములు లేకుండెను. కాబట్టి కృష్ణాజీ (కేశవ సుత్) తన తమ్ముడగు మోరో పంత్‌తో కలిసి నాగపూర్‌కు వెళ్లెను. కాని వారి చదువు కొరకు ఖర్చులు భరించుట తల్లి దండ్రులకు కష్టమైనది. అక్కడి ఉష్ణ వాతావర ణము కేశవసుత్ దుర్బల శరీరమునకు ఒంటలేదు. అక్కడ నివసించిన ఏడు నెలల కాలములో అతడు సుప్రసిద్ధ మహారాష్ట్ర కవి రెవరెండ్ నారాయణ్ వామన్ తిలక్ తోను, ప్రొఫెసర్ పట్వర్ధన్‌తోను మైత్రి సంపాదించెను. వారిద్దరిని ప్రశంసించుచు కవితలు వ్రాసెను.

రెవరెండ్ నారాయణ్ వామన్ తిలక్ పరిచయము వలననే కేశవసుత్‌కు కవితా రచన యందు ఆసక్తి జనించెను, తన పరిచయమును గురించి తిలక్ ఇట్లు ఉల్లేఖించెను :

"మేము చాల సన్నిహిత మిత్రులము. కేశవ సుత్‌లో కవిత ఆవిర్భవించి వికసించుటను నేను గమనించితిని. మేము 1883 వ సంవత్సరమున రెండు మూడు నెలలు నాగపూర్‌లోను, 1888, 1889 వ సంవత్సరములు పూనాలోను, 1895_1896 వ సంవత్సరములు బొంబాయిలోను కలిసి యుంటిమి."

పూనాలో తిలకును కలిసికొనినప్పుడు కేశవ సుత్ న్యూ ఇంగ్లీషు స్కూలులో మెట్రిక్‌లేషన్ పరీక్షకు తయారగుచుండెను. బొంబాయినుండి మరాఠీలో వెలువడు క్రైస్తవ పత్రిక యగు 'జ్ఞానోదయా' సంపాదక వర్గమున చేరి యుండెను. తిలక్ జ్ఞానోదయకు చిరకాలము నుండి రచనలు పంపువాడు. అతడు 10 ఫిబ్రవరి 1895 లో బాప్టిజమ్ పుచ్చుకొని యుండెను. తిలక్‌తోను, జ్ఞానోదయ తోను సన్నిహిత సంబంధము కలిగియున్నందున కేశవ సుత్ బంధువులు, అతడు కూడ క్రైస్తవ మతము అవలంబించునేమో అని భయపడు చుండిరి. ఆతనికి బైబిల్ పఠనమునందు అమితాసక్తి. తాను క్రైస్తవ మతము అవలంబింప నున్నట్లు అతడు తన తమ్ముడగు సీతారామ్‌తో ఒకప్పుడు చెప్పియుండెను. (ఫిబ్రవరి 1962 రత్నాకర్ పత్రికలో వి. ఎస్. కరందీకర్)-కేశవ సుత్, తిలకులు మిత్రులైనప్పటి కివి వారి కవితలలో వ్యత్యాసము కలదు. కేశవ సుత్ కవిత ఓజోగుణ ప్రధానము. తిలక్ కవిత ప్రసాద గుణభరితము. తిలక్ కేశవ సుత్‌పట్ల అధికాభిమానము కల వాడు. అతనిని గురించి తిలక్ ఒక కవిత వ్రాసెను. అతడు మరణించిన తరువాత రెండు విషాద కవితలు వ్రాసి జనవరి 1906 'కావ్యరత్నావళి'లోను, ఫిబ్రవరి 1906 'మనోరంజన్'లోను ప్రచురించెను.

నాగపూర్‌లో నివసించిన కొలది కాలములోనే కేశవసుత్ శ్రీ వాసుదేవ బలవంత్ పట్వర్ధన్ అను నొక సహృదయుడగు సంఘ సంస్కర్తపరిచయము పొందెను. 1888 లో అతనిని సంబోధించుచు ఒక దీర్ఘ కవిత వ్రాసెను. కవితను గురించి పట్వర్ధన్ అభిప్రాయములు కేశవసుత్‌ను చాల ప్రభావితుని చేసినట్లు కనిపించును. ఇద్దరును అభ్యుదయ దృక్పథము కలవారు. ఏకాంతమును ప్రేమించు వారు. సందడికి దూరముగా నుండు వారు. దక్కన్ వర్నాక్యులర్ సొసాయిటీకి పట్వర్ధన్ శాశ్వత సభ్యుడు. ఆగర్కర్ తర్వాత అతడే "సుధాకర్" పత్రికా సంపాదకు డయ్యెను. పట్వర్ధనునుగురించి కేశవ సుత్ వ్రాసిన కవితలోనివి ఈ పంక్తులు :

"విశ్వాంతరాళములోని చుక్కలలో కవి ఆత్మలను దర్శించును. ప్రజలు అద్దము ద్వారా చూచెదరు. కవిబిందులద్వారా కూడ చూడ గలుగును."

కొందరు విమర్శకులకు ఈ పంక్తులలో ఎమర్సన్ ప్రభావము కనిపించినది. వాస్తవమునకు భారతీయ వేదాంతము చేత ప్రభావితుడైనవాడు ఎమర్సన్ - కేశవ సుత్ ఏకాత్మవాదమునే భంగ్యంతరముగా వెల్లడించెను.

1883 లో కేశవసుత్ తన స్వగ్రామమైన ఖేడ్‌లో ఒక సంవత్సరము నివసించి పై చదువుల కొరకు పూనాకు వెళ్లెను. 11 జూన్ 1884 న అతడు పాఠశాలలో చేరినట్లు న్యూ ఇంగ్లీష్ స్కూల్ రికార్డుల వలన తెలియుచున్నది. 1889 వరకు పూనాలోనే యుండి తన ఇరువది మూడవ ఏట మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణుడయ్యెను. పరీక్ష రెండు తడవలు తప్పెను ఒక తడవ ఇంగ్లీషులో కొలది మార్కులు వచ్చినందు వలన తప్పెను. పరీక్ష తప్పుటకు గల కారణములలో ఒకటి అతడు చాల మెల్లగా వ్రాయువాడట ! ఒక తడవ కావ్యగోష్ఠిలో నిమగ్నుడై యుండి పరీక్షకు వెళ్లుటయే మరచి పోయెనట !

న్యూ ఇంగ్లీష్ స్కూలులో అతడు హరి నారాయణ్ ఆప్టే పరిచయము పొందెను. ఆప్టే సుప్రసిద్ధ మరాఠీ నవలా రచయిత. పత్రికా సంపాదకుడు. తన ఏకైక కవితా సంకలనమునకు తన మరణానంతరము ప్రచురణ కర్తకూడను. అతడు కేశవసుత్ సహకారియే కాక మిత్రుడును - పూనాలో కేశవ సుత్ గోవింద వాసుదేవ కానిట్కారును కలిసి కొనెను. అతడు కవియు, అను వాదకుడును - స్త్రీ విద్య అవసరమని వాదించువాడు. ఆంగ్ల సాహిత్యాభిమాని. కానిట్కార్ భార్య కూడ విదుషీమణి. స్కాట్ శైలిలో కానిట్కార్ వ్రాసిన 'అక్బర్,' 'కృష్ణకుమారి' వంటి చారిత్రక ఇతి వృత్తము గల దీర్ఘ కవితలను జస్టిస్ ఎమ్. జి. రణడే చాల ప్రశంసించెను. మెసర్స్ హయిమ్స్, ఎలిజబెత్ బ్యారెట్ బ్రౌనింగ్, కోలోదత్తల కవితలనిన కానిట్కార్‌కు చాల అభిమానము. థామస్ మూర్, థామస్ హుడ్, బైరన్, బర్న్స్, కీట్స్ వ్రాసిన్న లిరుక్కులను అతడు అను వదించెను. కానిట్కార్ దంపతులు, కేశవసుత్, ఆప్టేలు 'మనోరంజన్ - ఆణి - నిబంధ చంద్రికా' అను ఆ మాసపత్రికకు వరుసగా కవితలు, వ్యాసములు వ్రాయుచుండిరి. మాస పత్రికలో 1880 మొదలు 1890 వరకు కేశవసుత్ వ్రాసిన పదమూడుకవితలు ప్రచురింపబడెను.

కేశవసుత్ కవితా సరస్వతి. ఆంగ్ల కవితాధ్యయనము వలన ప్రభావిత మయ్యెను. కొందరు ఆంగ్లమున అతడు పాల్ గ్రేవ్ రచన "Golden Treasury' మరియు మెకే రచన ' A thousand and one Gems of English poetry ' అనునవి మాత్రమే అధ్యయనము చేసి యుండునని తలంతురు. కాని మ్యూక్సిలర్

రచన 'The works of Ralph waldo Emerson' మొదలగు ఇతర గ్రంథ ములను కూడ అధ్యయనము చేసి యుండును. అతడు ఉత్తరాలలో ఎమర్సన్ వాక్యములు పలు తావుల ఉట్టంకించును. తోరూ దత్త వ్రాసిన 'A sheaf Gleaned in French Fields' కూడ చదివి యుండును. డ్రమండ్, గెథే, పో, లాంగ్ ఫెల్లోల కవితలను, షేక్స్పియర్ వ్రాసిన కొన్ని సానెటులను అను వదిం చుటయే కాక అతడు ఆంగ్ల కవిత వ్రాయుటకు ప్రయత్నము చేసి యుండెను. "పాంచ్ - కవి" అను గ్రంథమున ప్రొఫెసర్ ఎమ్. వి. రాజాధ్యక్ష, కేశవసుత్ సంస్కృత వాఙ్మయమును ఔపాసన పట్టెనని ఉల్లేఖించెను. కాని మెట్రిక్ చదువు నప్పుడు సంస్కృతమున అతనికి తగినన్ని మార్కులు వచ్చి యుండలేదని బుజు వగుచున్నది కనుక, కొందరు విమర్శకులు దానిని ఖండించిరి.

న్యూ ఇంగ్లీష్ స్కూలులో ఆగర్కర్, లోకమాన్య బాల గంగాధర తిల కులవంటి అధ్యాపకు లున్నప్పటికిని వారు బోధించు విషయములందు కేశవసుత్ కు అభిరుచి కాని, ఆసక్తి కాని జనించినట్లు తోచదు. సంఘ సంస్కర్తయగు ఆ గర్కర్ మాత్రము అతనిని ప్రభావితుని చేసెను. అతడు తరగతిలో బద్ధకముగా కూర్చుండి తిలక్ మొదలగు ఉపాధ్యాయుల వ్యంగ్య చిత్రములు గీయుచుండువాడు. అతనికి ఆ కాలపు వక్తలనిన అభిమానము. అది పూనాలో ఆందోళనల కాలము. చిప్లూన్కర్ తన నిబంధమాలలో ఆంగ్ల భాషాభ్యాసము చేయుట ఆడసింహము పాలు త్రాగుటయే యని 1880 నుండి వ్యాఖ్యానించుట మొదలిడెను. "కేసరి" పత్రికా ముఖమున తిలక్ గర్జించు చుండెను. "సుధాకర్"లో ఆ గర్కర్ సంఘ సంస్కరణోద్యమమునకు నాంది ప్రస్తావన చేయు చుండెను. కిర్లోస్కర్, ఖాడేలు మహారాష్ట్ర రంగస్థలమును రూపొందించు చుండిరి. మరాఠీ నవలా రచనకు హరి నారాయణ్ ఆప్టే రూపురేఖలు దిద్దుచుండెను. కేశవ సుత్ సిగ్గరి కనుక సంఘ సంస్కర్తలలో కాని, రాజకీయ నాయకులలో కాని చేరుటకు సంకోచించు చుండెను. అతడు తన కవితా వ్యాసంగమునే అంటి పెట్టుకొని షెల్లీ వలె,

Drive my dead thoughts over the vniverse

Like withered leaves to quicken a new birth (ode to west wind)
అని ఆకాంక్షించెను.

అతని జీవితముపై అతని సోదరు లిరువురి ప్రభావము, పరోక్షముగా ఎట్లు పడెనో పరిశీలింతము అతని తమ్ముడు మోరో కేశవదామ్లే (1868-1913) బొంబాయి యూనివర్సిటీనుండి ఫిలాసఫీ, చరిత్రలతో పట్టభద్రుడయ్యెను-"మాధవ్

కాలేజీ (ఉజ్జయిని)లో 1894 నుండి 1907 వరకు ఫిలాసఫీ ప్రొఫెసర్‌గా పని చేసెను. 1908 లో ఉజ్జయిని కాలేజి మూసి వేయబడెను. అప్పుడతడు నాగపూర్ సిటీ స్కూల్‌లో ఉపాధ్యాయు డయ్యెను 1913 వ సంవత్సరమున అతడు రైలు ప్రమాదమునకు గురియై అకాల మరణము చెందెను. అతడు 900 పేజీల మరాఠీ వ్యాకరణము సమగ్రముగా, శాస్త్రీయముగా రచించెను. (వి. కె. రాజ్వాడే వంటి సంస్కృత విద్వాంసు లొక రిద్దరి దృష్టిలో అది అంత శాస్త్రీయము కాదు) మోరో కేశవదామ్లే బర్క్ ఉపన్యాసముల నను వదించెను. అనుమాన, ప్రతిష్ఠాపన విధాన తర్కమునకు చెందిన ప్రారంభ గ్రంథము వ్రాసెను. ఇంకొక తమ్ముడు సీతారామ్ కేశవ్ దామ్లే (1878-1927) పత్రికా రచయిత, నవలాకారుడు, దేశభక్తుడు. 'జ్ఞానప్రకాశ్,' 'రాష్ట్రమత్' అను రెండు పత్రికల సంపాదక వర్గమున అతడు చేరి యుండెను ముల్షి సత్యాగ్రహమున పాల్గొని నందున రెండు సంవత్సరముల జైలు శిక్ష పొందెను. అల్పాయుష్కులయినను ఏకాదృశ ప్రతిభావంతులగు వ్యక్తులు ఉద్భవించుట వలన దామ్లే కుటుంబము వాసి కెక్కినది. అసమాన ప్రతిభా విలసితులగు తన వారు అల్పాయుష్కులగుటయే అతని కవిత విషాదచ్ఛాయా చిహ్నిత మగుటకు కారణ మన వచ్చును.

పేదరికము వలన కేశవసుత్ మెట్రికు తర్వాత ఉన్నత విద్య నభ్యసింపలేక పోయెను, అతడు 1890 లో ఉద్యోగాన్వేషణకొరకు బొంబాయికి వెళ్లెను. ఉన్నత విద్యలేకపోవుట ఒక లోపము. అందులో అతడు చాల ఆత్మాభిమానము కలవాడు. సమాజమున ఉన్నత స్థానము నలంకరించియున్న వి. యన్. మాండ లిక్‌వంటి కుటుంబ మిత్రుల పలుకుబడిని ఉపయోగించు తలంపుచేసివాడు. కనుక అతడు ఒక మిషన్ స్కూలులో టీచరుగా చేరెను. తరువాత అమెరికన్ మిషన్‌చే నడుపబడు జ్ఞానోదయ పత్రికా కార్యాలయమున పని చేసెను. ఆపైన దాదర్ న్యూ ఇంగ్లీషు స్కూలులో టీచరుగా నియుక్తుడయ్యెను. అతని స్వల్ప వేతనము నకు తోడుగా కొన్ని ప్రయివేటు ట్యూషనులు చెప్పవలసి వచ్చుచుండెను. (అతడు జీవితకాలములో ఎన్నడును ఇరువది, ఇరువదియైదు రూపాయలకంటె ఎక్కువ జీతము పొందలేదు.) కొన్ని సమయములలో అతడు నిరాధారుడై స్వగ్రామ మునకు పోవలసి వచ్చుచుండెను. అస్తవ్యస్తమైన అతని అస్థిర జీవనము అతని తండ్రికి నచ్చినది కాదు ప్రవాహములో కొట్టుకొనిపోవు దుంగవలె కాక ఒక చోట స్థిరపడి యుండుమని అతడు కొడుకుకు బోధించు చుండెను. అందువలననే యిష్టము లేకున్నను కేశవసుత్ 1893 లో బొంబాయి నగరమున స్థిరపడుటకు ప్రయత్నిం

చెను. ఆత్మ కథ రూపమున వ్రాయబడిన 'సింహావలోకణ' అను కవితలో అతడు తన కుటుంబములోని కలతలను సూచించి యున్నాడు. 1819 లో కల్యాణ్‌లోని ఒక ఇంగ్లీషు స్కూలులో కేశవసుత్ టీచరుగా పని చేసెను. కొంత కాలము 'కమిసరేట్'లో గుమాస్తాగా వ్యవహరించెను. కాని తన యిష్టమునకు విరుద్ధముగా కరాచీకి బదిలీ చేయబడినందున ఉద్యోగమునకు రాజీనామా పెట్టెను. అతడు 'మోర్స్ కోడ్స్' అధ్యయనము చేయుటకును ప్రయత్నించెను. 1893 వ సంవత్సరమున ఆరుమాసములపాటు సావంతవాడిలో టీచరు పదవి నిర్వహించెను.

బొంబాయిలో టీచరుగా స్థిరపడవలె ననుకొనిన కాలముననే కేశవసుత్ కాశీనాథ రఘునాథమిత్ర, జనార్దన ధోండో భాంగలే, బాలకృష్ణ కాలేల్కర్ అను ముగ్గురు యువ రచయితులను, పత్రికా సంపాదకులను అగు వారి పరిచయము పొందెను. ఆ ముగ్గురితో కలిసి కేశవసుత్ 'మనోరంజన్' మాస పత్రిక (1895లో స్థాపితము)కు అనేక కవితలు వ్రాసెను. మిత్రా మరియు భాంగలేలు బెంగాలీ, గుజరాతీ భాషలలో మంచి ప్రవేశము కలవారు. భాంగలే బంకిమ చంద్రుని నవలలను, ఒక గుజరాతీ నవలను అనువదించెను. బంకింబాబు వ్రాసిన 'ఆనంద మఠము' అను సుప్రసిద్ధ నవల 1894 వ సంవత్సరమున ఆనందాశ్రం అను పేర మరాఠీలో అనూదితమయ్యెను, 'వందే మాతరం అను సువిఖ్యాత జాతీయ గీతము ఆ నవల యందలిదే. కేశవసుత్ తన 'కవితేచే ప్రయోజన' (మే, 1894) అను కవితలో ఆ గీతమున గల సుజలాం, సుఫలాంవంటి విశేషణము లెన్నిటినో మాతృదేశాభివర్ణనకై గ్రహించెను. బొంబాయిలో నివసించు కాలమున అతనికి మాధవానుజ్ (డా. కాశీనాథ్ హరిమోదక్ 1872-1916), కిరాత్, శ్రీ గజానన భాస్కర్ వైద్య (తరువాత హిందూ మిషనరీగా ప్రఖ్యాతుడు) వంటి కవుల పరిచయము లభించెను. శ్రీ వైద్యసోదరుడు ఊహాబలమున కేశవసుత్ పెన్సిల్ స్కెచ్చి గీసినాడు. ప్రార్థనా సమాజ్ (బెంగాలులోని బ్రహ్మ సమాజమును పోలిన మహారాష్ట్ర సమాజము), ఆర్యసమాజ్, క్రైస్తవ మిషనులలో జరుగు భాషణలను కేశవసుత్ ఆసక్తితో వినుచుండువాడు. 1896 వ బొంబాయిలో ప్లేగు వ్యాధి వ్యాపించెను. అప్పుడతడు ఖాందేశ్‌లోని భాద్గాంవ్‌కు వెళ్లి పోయెను. తన భార్యను, బిడ్డలను మామగారింట చాలీస్‌గాంవ్‌లో సురక్షితముగా ఉంచ దలచెను. మామగారి సలహా ప్రకారము భాద్‌గాంవ్‌లోని ఏ. వి. స్కూల్‌లో ఒక టీచర్ పదవికి దరఖాస్తుపెట్టి నెలకు పదునేను రూపాయల వేతనముగల ఉద్యోగము సంపాదించెను.

1897 నుండి 1904 వరకు అతడు ఖాద్గాంవ్‌లో నివసించెను. తొలుత మ్యునిసిపల్ స్కూల్‌లో పని చేసెను. కాని అచట జీతము స్వల్పము. పెన్షను దొరకదు. అందువలన 1898 లో ట్రైనింగు పరీక్షలో ఉత్తీర్ణుడయ్యెను. 1901 లో ఫైజ్‌పూర్ ఇంగ్లీషు స్కూలుకు హెడ్మాస్టరుగా నియమితుడయ్యెను. అచట అతడు ఇంగ్లీషు బోధించెను. దురదృష్ట వశమున ఆ మరునటి సంవత్సరమే అచటకూడ ప్లేగు వ్యాపించెను. పాఠశాల మూసివేయు ప్రమాదము వాటిల్లెను. ఇంతలో కేశవసుత్ స్వేచ్ఛాప్రియ ప్రవృత్తి పాఠశాల నిర్వాహకులతో అభిప్రాయ భేదమునకు దారి తీసెను. అతడు బదిలీ కొరకు దరఖాస్తు పెట్టెను. ఏప్రిల్ 1904 న ధార్వార్ హైస్కూల్‌కు మరాఠీ టీచరుగా అతని బదిలీ జరిగెను.

ఖాందేశ్‌నుండి కేవలము కవితా ప్రచురణకు ఉద్దిష్టమైన పత్రిక ఒకటి 'కావ్య రత్నావళి' అనుపేర వెలువడు చుండెను. దాని సంపాదకుడు నారాయణ్ నరసింహ ఫడ్నీస్ చక్కని కవితాభిరుచి కలవాడు. అతడు కేశవసుత్‌ను గురించి ఇట్లు వ్రాసెను.

"మా పత్రిక గర్వించదగిన పంచరత్నములవంటి ఐదుగురు కవులలో కేశవసుత్ ఒకడు. 'హరప్‌లేలీ శ్రేయ' అను అతని కవితను మా పత్రికలో చివరి సారిగా ప్రచురించితిమి..........అతడు స్వతంత్ర భావములుగల కవి. అతని కవిత లోని భావౌన్నత్యము, ఉత్కృష్టత ఎవరినైన ఆశ్చర్య చకితులుగా జేయును. అతని చిత్తవృత్తి ఆచరణ యోగ్యము కానిది. మానసిక స్థితి అస్థిరమైనది. మేము రెండు మూడు తడవలు అతనిని కలిసి కొంటిమి. సిగ్గరి యగుటవలన అతడు మాయెదుట అంతగా మాటలాడలేదు" (1905 చివరి కావ్యరత్నావళి)

ఖాందేశ్‌లో కేశవసుత్ సంపాదించిన ఇంకొక ప్రముఖ మిత్రుడు జాతీయ కవి వినాయక్ (వినాయక్ జనార్దన కరందీకర్ 1872-1909). బొంబాయిలో వారిరువురు 1891, 92 వ సంవత్సరములలో కలిసియుండిరి. కేశవసుత్ అతనిని మహారాష్ట్ర బైరన అని పిలుచు చుండెను. ఇద్దరిలో చాల సామ్యముండెను. ముఖ్యముగా ఇద్దరును సామాజిక క్రౌర్యము, రాజకీయదాస్యము ఈరెంటిని ప్రతి ఘటించువారు. కేశవసుత్ జీవితపు చివరి దినములచట కొంత సుఖముగా గడచెను. అతనికి అవసరములగు ప్రాకృతిక పరిసరములు, చదువుటకు కావలసిన గ్రంథ ములు అచ్చట లభించెను. అతడు కవిత్వ తత్త్వ సమాలోచన చేయుచు, మిత్రు లతో తరుచు గంభీర విషయముల గురించి చర్చించుచు కాలము గడపెను.

ఏప్రిల్ 1904 నుండి కేశవసుత్ పదునెనమిది నెలల వరకు ధార్వార్‌లో నివసించెను. అచట, నశ్వరమును, దుఃఖ పూరితమును అగు మానవ జీవితమును గురించియే ఆలోచించు వాడనిపించును. తన అకాల మృత్యువును గురించి ముందు గనే గ్రహించి నట్లున్నాడు. 25 వ మే 1905 న చిపుల్‌ణా'లో వ్రాసిన తన చివరి కవితను గురించి ఒక మిత్రునకు ఇట్లు వ్రాసినాడు. "మనోరంజనాలో ప్రచురిత మైన నా కవిత వలన నా హృదయస్థితిని ఊహించి యుందువు - హృదయము తాపము వలన బీట వారినది. శాంతికి మార్గమేది?"

నిజముగా మార్గము లేక పోయినది. అతడు, అక్టోబర్ చివరన హుబ్లీలో నివసించు రోగగ్రస్తుడగు తనదూరపు పినతండ్రి హరి సదాశివ దాస్లెను చూచుటకై తన భార్యతోను కుమార్తెతోను వెళ్లెను నాలుగైదు దినములలో ధార్వార్‌కు తిరిగి వెళ్ల దలచెను. కాని 7 వ నవంబర్ నాడు ప్లేగు వ్యాధికి గురియై మరణించెను. ఎనిమిది దినముల తరువాత అతని భార్య అతని ననుసరించెను, అతని అంతిమ సంస్కారము అతని పిన తండ్రియే చేసెను. అతని కుమార్తెలు ముగ్గురు కోంకణ్‌కు పంపబడిరి. వారిలో ఒకర్తు కొలదిదినములకే మరణించెను. కడమ ఇద్దరి వివాహములు జరిగినవి. కాని వారిని గురించిన సమాచారమేదియు తెలియదు.

ముప్పది తొమ్మిదేండ్ల విషాద భరితమైన స్వల్పజీవితము అతనిది. దానికి సరియైన వ్యాఖ్యానము అప్పుడప్పుడా యన వెలువరించిన యభిప్రాయములే. కవి సమ్మేళనముల గురించి ఒక మిత్రున కిట్లు వ్రాసెను:

"వార్షిక కవి సమ్మేళనము—కార్య వాదులగు వారు ఏ ప్రయోజనార్థముచ, అప్పుడప్పుడు 'సమావేశమగుదురు. కవులు స్వప్న జగత్తులో విహరించు వారు గనుక ఏకాంత వాసులై, విశ్వబద్ధత యొక్క దివ్యనాద శ్రవణము చేయుచు, కవితా వేశము కలిగినప్పుడు దానిని తమ భాషలలో మలచుటకు ప్రయత్నింతురు. భావ సాదృశ్యము గల కవు లొకరిద్దరు కలిసిన ప్రమాదములేదు. పలువురైన రసాభాస యగును."

ఇంకొక మిత్రునకు వ్రాసిన లేఖలో అతడానాటి కవిత నిట్లు విమర్శించెను.

"చిన్నచిన్న కవితలు వ్రాయుచు కాలము వ్యర్థముచేయక మహాకావ్య రచన చేయవలసినదిగా.........గారికి చెప్పుము. ఒక శతాబ్దము నుండి మరాఠీలో మహా కావ్య రచన జరుగలేదు...............గారివంటి ...............గారివంటి మేధావులు ఆలోపమును సవరింప సమర్థులు. నేను వామనుడను. త్రివిక్రముడ నగు లక్షణము

లేవియు ఇంతవరకు నాలో కాన్పించుట లేదు. అందుకు నాపై నాకే అసహ్యము. అందుకే చిల్లర కవితలు వ్రాయువారిని అభినందించలేను."

పైన ఉదాహరించిన లేఖలు కేశవసుత్ తన మిత్రులకు ఆంగ్ల భాషలో వ్రాసినవి.

## ప్రకృతి

'సమస్త కళయు ప్రకృతి యనుకరణము' అను సెనెకా అభిప్రాయముతో గాని, 'ప్రకృతి కళయొక్క అనుకరణము, అని అస్కార్‌వైల్డు తద్విరుద్ధముగా ప్రకటించిన అభిప్రాయముతోగాని మనము ఏకీభవింపనవసరములేదు. కేశవసుత్ కవితలో, ఆతనికిని ప్రకృతికిని మధ్య విషాదయుతముగ సంచలించు సంబంధ మేదియో మనకు కాన్పించును. ప్రకృతి, ఆతని తీరని కోరికల ప్రతిధ్వనుల నాతని కవితలో ప్రతిబింబించు గమ్యము. ఏకాంతములును విషాదభరితములు నగు ఘడియలు గడుపుటకై ఆతడు తలదాచుకొనుస్థలము, ఈ సందర్భమున వి. ఎస్. ఖండేకర్ ఆతని 'ఏక్ ఖేడే', 'సైబుత్యేకడిల్ వారా' మున్నగు కవితలు ప్రస్తావించెను. ఆ కవితలలో మాటిమాటికి కాన్పించు రమణీయ కోంకణ ప్రకృతివర్ణన. మాతృ భూమి పట్ల ఆతనికి గల మమకారమును వ్యక్తము చేయును. 'ఏక్ ఖేడే' అను కవితలో కేశవసుత్ ఇట్లనును:

"అచటి మందిరములు ఉన్నతములుకావు,
కాని, అచట మహోన్నత పర్వతములు కలవు.
కొండ వాగుల నిరంతర గానముతో
శ్రుతికల్పి పవనములు వీచుచుండును."

కేశవసుత్ కవితలలో కేవల ప్రకృతి వర్ణనాత్మకమైనవి రెండే. ఒకటి 'వర్షన్యా ప్రత్' (వర్షములనుద్దేశించి) ఇంకొకటి 'దీవాళీ' 'దీవాళీ' అను కవిత మొదటి సగము ప్రకృతి వర్ణనాత్మకము,' వర్షన్యాప్రత్' అను ఇరువది పంక్తులకవిత కాళిదాసుని ఋతు సంహారమును స్మరింపజేయునట్టిది. వాస్తవిక ప్రకృతి వర్ణనతో ఆకవిత ఇట్లు మొదలగును.

"వేసవిలో వేడిమివలన నేల పగిలి బీటవారినది,
దుమ్ముకొట్టిన కనులతో పశువులు వచ్చికకై
వ్యర్థ ప్రయత్నము చేయుచున్నవి. నీడ

పట్టున, నీళ్లు గలచోట నుదుగులు క్రక్కుచు
పశువులు చేరుచున్నవి, పాంథులు చేరుచున్నారు.
ఈ విధముగా ఎన్నియోదినములు గడచినవి.
ఓ వర్షమా! ఇప్పటికైన రమ్ము; త్వరగారమ్ము.
లంకమీదినుండి రమ్ము.
నూతుల అడుగుల నుండి కప్పలు రాత్రి
యంతయు నిన్నాహ్వానించుచు అఱచుచున్నవి."

"దీవాళి" అను కవితలో శరత్ సుందరి వర్ణన ప్రాచీనకావ్య సరళిలో చేయబడినది. అందు, కవి శరత్తును ఉదయమున గోపాలునివలె, మధ్యాహ్నమున జలదానము చేయుమహర్షివలె, సాయంసమయమున అలసిన కృషీవలునివలె సంభావించును. పలుకవితలలో కేశవసుత్ పుష్పమును, సీతాకోక చిలుకను ప్రతీకలుగా స్వీకరించెను. కాని యిచట వర్ణ్య విషయములు వాని వన్నె చిన్నెలుగావు. మానవజీవితపు వివిధావస్థలను అన్యాపదేశముగా అభివర్ణించుటకు అతడు ప్రకృతిని ప్రతీకగా గొనును.

ప్రకృతిని గుఱించి ఏమర్సన్ వ్రాసిన వ్యాసమును కేశవసుత్ చదివినాడనిపించును. అందురచయిత ప్రాచీనారణ్యక ఋషివలె ఇట్లనును. "అరణ్య ప్రకృతిలో నిత్య యౌవనము లభించును. మహోదాత్తత శాశ్వతముగా వెలయును, దివ్యమైన దేదైనను అమరము, సత్తుసదా పునరుద్భూత మగుచుండును. ప్రకృతి సౌందర్యము, బుద్ధిలో వికాసము పొంది వృథాలోచనమునకు గాక నూత్న సృష్టికి దోహదము చేయును. ప్రశాంత ప్రకృతిలో, ముఖ్యముగా దిగంతముల దూరతీరములలో మానవుడు స్వభావాను రూప సౌందర్యమును దర్శించును." అట్లగుట, కేశవసుత్ ప్రకృతిలో ఉపశాంతిని పొందెను. "దూర్ కోఠే ఏకలా జావూనియా" (దూరాన ఎచటనో ఒంటిగా వెళ్ళవలె.) అను కవితలో అతడిట్లనును:

"ఎన్నోతడవలు మనస్సు విఱిగినది.
ఎన్నియో ఆశలు చచ్చిపోయినవి
వానినన్వేషించుచు, 'ఏకతార' పుచ్చుకొని
నిర్జనారణ్యములకు వెళ్ళవలె."

కేశవసుత్ కు ప్రకృతి ఒకప్పుడు ఉపదేశకునివలెను, మరొకప్పుడు పక్షవర్గములులేని సహచరునివలెను కనిపించును. క్రూరముగా ఎప్పుడును కనిపించదు. "వాతచక్ర (సుడిగాలి) అను కవితలో అతడిట్లనును:

"ఇక్కడెందుకు నిలుచుట ?
నన్ను బంధించి నిలుపుటకు ఇక్కడ ఏమున్నది ?
సుడిగాలిలో గిరిగిర తిరుగుచు
సచ్చిదానందములోలయముగావలెనని పించుచున్నది.

చివరికాలములో వ్రాసిన 'హరప్లేశ్రేయ' (అపహృతా దర్శము) అను దీర్ఘకవితలో అతడు గాఢ నిరాశోపహతుడుగా తోచును. ప్రకృతి గూడ అతనిని పూర్తిగా సంతృప్తి పరచదు.

"ఎచట వాగులు, గుట్టలు కలవో
అచట నా మనస్సు రమించును.
ఎందుకనగా అచట జీవితాదర్శము ప్రస్ఫుటమగును.
అందుకే ఈ ఆరణ్య పథములకు మాటి మాటికి వత్తును.
అవి నాకు బాగుగా పరిచితాలు.
కాని అవిగూడ ఆదర్శము నొకత్రుటి కాలము
తళుక్కుమనిపించును.
మరుత్రుటిలో అవి మాయమగును.
'నా ఆదర్శమును మరల పొందలేనుగదా'
అని వా పోవుదును."

నదీతీరమున విహరించుచు అతడు అద్భుతత్వమును, మహోదాత్తతను దర్శించును. హాజ్లిట్ వలె, 'దూరాన తేలియాడు మబ్బుతునక నుండి గతములో లీనమై పరవశించె దను' అను అను భూతిని పొందును.

ప్రకృతిపట్ల కేశవసుత్ అవలంబించు అద్భుత కల్పనాత్మక శైలిని విలువ కట్టునప్పుడు సాంప్రదాయిక మరాఠీ కవితను దృష్టియందుంచుకొన వలసియుండును. ప్రకృతిని ఆలంబనముగా నుపయోగించు సంస్కృత కావ్య రీతులపై ఆధారపడినది మరాఠీ సాంప్రదాయిక కవిత. కేశవసుత్ సమకాలీనులలో "రెవరెండ్ తిలక్", పిల్లలకును, పువ్వులకును చెందినకవి, యని ప్రతీతి. బాలకవి థోమ్రే ప్రకృతి యొడిలోని పాప. కేశవసుత్ తరువాతి కాలమున వెలసిన కవితలలో మనిషికి ప్రకృతికి నడుమ తీవ్రఘర్షణ కల్పించును. ప్రప్రథమమున కేశవసుత్‌కు ప్రకృతి సాకారమైన అనుభూతిగా, దివ్యమును మహనీయమును అగు వస్తువుగా గోచ

రించును. సాంప్రదాయిక శైలిలో ఋతువర్ణనచేయుట, ఉదయాస్తమయ వరవ చేయుటకంటె ఇది భిన్నము. కేశవసుత్ చేసిన అస్తమయ వర్ణన ఇట్టిది:

"సాయం సమయము: సూర్యుడు సముద్రములో
దిగుచున్నాడు. అతని సుందరవదనమును
అలలు ముద్దుగొనును. భూమిపై రాలిన
పూవు ధూళియగు నట్లు
రవి బింబము కరాళ తరంగాలలో లయించును.
ప్రణయ జీవులారా! ఈ సంధ్యమీకు హర్షము కూర్చుగాక.
నాకు అసూయలేదు. నాలో ప్రేమ భావనలేదా?
ఇల్లు విడిచి చాల దూరాన ఉన్నాను.

విచారముగానున్నానా ఈ సంధ్యా కాలమున? ఔను, ఇంకెట్లుండగలను?".

'ప్రకృతి భగవంతుని కవిత', 'భగవంతుడు ప్రకృతిలో వెలయును'.— మొదలగు మాట లతనికి రుచించునవికావు. అతడెన్నడును అదృష్టవంతుడుకాడు. కనుక కఠినాత్ముడగు భగవంతుని సంభావింపలేక పోయెను. కేశవసుత్ సన్నిహిత మిత్రుడు 'కిరాత్' ఇట్లు వ్రాసెను:

"అతనికి ఈశ్వరాస్తిక్యమున విశ్వాసమున్నట్లు తోపదు. కాని ఈనడుమ (ఈ వ్యాసము కేశవసుత్ చివరికాలమున, జనవరి 1906 'మనోరంజన్'లో ప్రకటితము) రెండు మూడేండ్లనుండి అతని అభిప్రాయము కొంత మార్పుచెంది నట్లున్నది. ఎందుకనగా ఉత్తరముల శీర్షమున 'శ్రీరామ' అని వ్రాయుచున్నాడు. కొందరు భక్తుల సంబంధమున చెప్పబడునట్లు, షేక్స్పియర్ 'Pericles'లో ప్రస్తావించినట్లు, ఏదోవింత యగు మధురనాదము తనలో తాను విను చున్నట్ల తడు నాతో చెప్పెను." ఇట్టినాదమును వినుచున్నావు గనుక త్వరలోనే ఒకనాడు తుకారామ్ వంటి సాధు సత్తముడవు, సంపూర్ణ ఆస్తికుడవు కాగలవు." అని నేనంటిని. "ఇప్పుడునేను కవితనెంత గాఢముగా ప్రేమించు చున్నానో ఒకనాడు 'వానిని' గూడ అట్లే ప్రేమింతునేమో!" అని అతడు బదులు చెప్పెను."

కేశవసుత్ కవితను పరిశీలింతుమేని అతడు వేదాంతివలె ద్వైధీ భావమగ్నుడయినట్లు కనిపించును; 'ప్రకృతియే పరమాత్మయేని, అంతయు ప్రేమ మయమేని ఈ ప్రపంచమున ఇంతటి దుఃఖ మెందుకు?' శంకరాచార్యుల మాయావాదము ననుసరించి, 'ఇదంతయు మాయ' అన్నప్పటికిని, కేశవసుత్ అనినట్లు,

"ఈ దృశ్య మానమయిన దంతము
స్వప్నములో స్వప్నదర్శనము: "

అన్నప్పటికిని కుదురదు. కవి నాస్తికుడేని దేవద్వేషిగా మతవిరోధిగా తయారగును. కేశవసుత్ ఒకంతకు అట్టివాడే. ఆ కాలమునకును ఆ వయస్సునకును చెందినకవి ఎవ్వడును, వనవాణిని, అతిమెల్లగా నైన బహిర్గతము చేయగల సమర్థుడు కాడు. కాని కేశవసుత్ అంతర్గతస్పృహా, అతని రసాత్మకమగు వివేచన, అతనిని మతద్వేషిగా సంశయాత్మకునిగా మార్చకుండ కాపాడెను. అతడేదో అస్పుట విశ్వాసమును పట్టుకొని ప్రాకులాడెను. బహుశః అతడుగూడ టాగోరువలె 'వనవాణి'ని ఆలకించెనేమో!

## ప్రేమ

నాగపూర్ రేడియోనుండి శ్రీ ఏ. ఆర్. దేశపాండే 'అనిల్' కేశవసుత్ ప్రణయ కవితను ప్రశంసించుచు కావించిన ఈ ఉపన్యాసము, తరువాత, 'తరుణ్ భారత్' పత్రికలో ప్రచురిత మైనది.

"మరాఠీ ప్రణయ కవితకు కేశవసుత్ వైతాళికుడని నా అభిప్రాయము. అతని కవిత చాలవరకు ఆంగ్ల కవితనుపోలి యున్నప్పటికిని అతడు ఒక విధముగా కాళిదాస భవ భూతుల కవితలతో తన కవితను అను సంధానించెను. మధ్య యుగమున ఎన్నో శతాబ్దులు భారత దేశపు సాంఘిక జీవితమును స్పృశించనైన లేదు. యువతీ యువకులలో పవిత్రమైన, సహజమైన, ప్రేమ తత్పర్యవసానముగా ప్రేమ వివాహములు, భారత సమాజమునకు పరిచితము. కాని సాహిత్యమునందు వాని ప్రసక్తి లేదు. వ్యక్తి ప్రాముఖ్యము, వ్యక్తి స్వాతంత్ర్యము, పునఃస్థాపితమైన తరువాత సామాజిక బంధనములు సడలెను. ఇట్టి కవితా భావములకు కేశవసుత్ వాణి ఉపస్ఫూర్తము."

అతని తొలి ప్రణయ కవితయగు 'ప్రియేచేధ్యాస' అనునది ఆత్మాశ్రయ ధోరణిలో వ్రాయబడినది - భార్యాభర్తల ప్రణయమిందులో సాంప్రదాయిక పద్ధతికి భిన్నముగా చిత్రితమైనది.' 'ఒగ్. బోటీచ్యా కొండాశీ సముద్రాచ్యా శోభేకడే పహాత్ అసల్యేలా ఏక్ తరుణీస్' (స్టీమరు రేలింగు నానుకొని నిలిచి సముద్ర శోభను తిలకించుచున్న ఒక తరుణి నుద్దేశించి) అను కవితలో ఆదర్శముగా నిలువదగిన ప్రేమయొక్క సంక్షిప్తరూపమును ప్రదర్శించుచు నాతడిట్లనును:

'మన ప్రేమ సుస్థిరమేని,
నీవు ప్రేయసివి, నేను ప్రియుడను——

కాదా, నేను ప్రేయసిని, నీవు ప్రియుడవు.
ఒకరి నొకరము ప్రణయబంధమున బంధింతము.

కేశవసుత్ దృష్టిలో శారీరకప్రేమ, ఆదర్శప్రేమ—ఏదైనను పవిత్రమగు "ప్లెటానిక్" ప్రేమయే.

మిత్రు డొకడిక కదలుదమా యని ప్రశ్నించునప్పుడు కవి యిట్లు బదులు చెప్పును;

'మిత్రుడడుగును, "నీ మనస్సు పరధ్యానముగా నున్నదేమి?" నేనంటిని, "నీ మనస్సు నడుగుము."

అతడడుగును, "కవిత నిన్ను ఆటకాయించుచున్నదా?"

"కాదు, కవిత నన్ను వివశుని చేయును. కాని నన్ను కదిలించుటలేదు."

"ప్రీతి-అణి-తూ" (ప్రేమ-నీవు) అను కవితలో కేశవసుత్, "ప్రేమను, నిన్ను గురించి తప్ప అన్యమేదియు ఆలోచింపలేను." అని ఒప్పుకొనును.

'ప్రణయకథా' అను కవితలో 'పరిమిత చేష్టాతత్పరములగు భౌతిక హస్తాలు అధి భౌతికమగు నంతరంగ చిత్రణ మెట్లు చేయును?' అని విచారించును.

కేశవసుత్ కవితకు అందలి మార్మికత వింత సొగసును కూర్చినది. కీట్స్ వంటి వైషయిక భావన, బైరన్‌వంటి 'రక్తాంశ' లేనప్పటికిని బాడ్లియర్ వలె కేశవసుత్ ప్రణయ కవిత కాల్పనిక లోకమున నిలయ దిరుగును—అదృశ్యము, అవిదితము అగు వస్తు స్పర్శగల సాంప్రదాయిక కవితకు భిన్నమయిన దగుట కేశవసుత్ కవితను ఏ. ఆర్. దేశపాండే, ఒక విధమగు అద్భుత కల్పనాత్మకమైన నవ్యమర్మ కవిత అని పేర్కొనెను. ఆచార్య ఎస్. జే. భాగవత్ 'జీవితపు లోతు లను పరామర్శించి జీవితానుభవములను ప్రయోగాత్మకముగా పరిశీలించిన తాత్త్విక కవి' యని ప్రశంసించెను. కేశవసుత్ కవితలో మూడు పాళ్ల ప్రేమయొక్క వివిధా వస్థలు వర్ణితము లైనవి. ఈ ప్రేమ శరీర సంబంధమైనదికాదు. అందు ఆలింగన చుంబనాదులప్రసక్తి అంతగా కనిపించదు. సంస్కృత కవిత శృంగార రసభూయి ష్ఠము—కేశవసుత్‌కంటె పూర్వమునసున్న మరాఠీ జానపదకవిత, లావణీ అను నది, శృంగార ప్రధాన మైనది. కేశవసుత్ కవితలో వైషయిక ప్రణయము దివ్య ప్రణయముగా పరివర్తన చెందినది. దాని యందలి ఇంద్రచాపవర్ణములు ఒక నన్నని విషాదరేఖమండి వెలువడినవి.

"ప్రేమ దివ్యము-అలౌకికము-ప్రేమ బీజము హృదయమున మొలకెత్తును. అది పుష్పించును. ఆ పుష్పదామము ప్రియురాలికొరకు-ప్రేమ బాజారులో దొరకదు. ఇంకే వస్తువుకు బదులుగా అది లభించదు-ప్రేమ వలన ప్రేమ లభించును."

ఈ విధముగా కేశవసుత్ వాదించును.

అప్రయత్నముగనే కేశవసుత్ కబీరు ననుసరించెను. కబీరు తన 'దోహా' ఒక దానిలో చెప్పిన భావమిది:

'ప్రేమతోటలో మొలుచునదికాదు-

ప్రేమ బాజారులో విక్రయింపబడదు.

ప్రేమించువాడు సామాన్యుడైనను, చక్రవర్తియైనను, తల విచ్చి దానిని పొందును.'

కేశవసుత్ దృష్టిలో ప్రేమ 'పుష్పాలాపము'. అతడు నిర్జనారణ్యములో ప్రియురాలితో కలిసి విహరించుటకు ఉవ్విళ్లూరును:

"నేను ముండ్లపొదలు నరికి వేసెదను,
అడవి మృగములను సంహరించెదను.
ఆమె కొరకు కోట నిర్మించెదను.
ఆమె సౌఖ్యముకొరకు నాప్రాణాలను బలియిచ్చెదను.
వన్యలతలవలె ఒకరి నొకరము అల్లుకొని
నరకమును స్వర్గధామముగా రూపొందింతుము."

కేశవసుత్ ప్రేమ ఆదర్శప్రాయమును, అద్భుత కల్పనాత్మకమునైన స్వాప్నిక విషయము. ప్రేయసికి సమర్పించిన పుష్పములను స్మరించి ఆమె తనను మన్నించునని అతడను కొనును. ప్రణయ సంబంధమైన అంతరంగ భావములను మానసిక పరిస్థితులను వర్ణించుటకు ప్రాముఖ్య మొసగును. అతని ప్రేమ విషయ దూషితముకాదు. పసిపాపలు, మంచుబిందువులు, చుక్కలు, పూర్వస్మృతులు, పల్లెటూరి తుంటరులు, సాయంసంధ్యలో ఊగినలాడురంగులు, గులాబిమొగ్గ, లేహంట్ వ్రాసిన 'Jenny Kissed me' అను కవిత, ఇట్టి వన్నియు దాని పరిధిలో చేరినవే—

కేశవసుత్ ప్రణయకవిత కరుణారస మిళితమైనది—మాటి మాటికిని అతడు చెదిరిన కలలను ప్రస్తావించును. అతని ప్రణయ కవితలో విరహ వ్యథ లేక పోలేదు. ఎడ్గార్ అలెన్ పో వ్రాసిన 'Raven' మీద ఆధారపడినప్పటికిని అతని

'ఘూబడ్' (గుడ్లగూబ) అను కవిత ఆవేదనా పూరితమైనది. అందలి కొన్ని-పంక్తులివి :

"వెళ్ళిపో, నన్నురోదించనీ,
నా హృదయము దుఃఖముతో పొంగి పొరలనీ,
నా చెవులలో నీశబ్దము పడనీయకు,
అదినా విషాద హృదయము మీదబరువు.
నా గాయాలను కెలుకకు.
ఇక్కడినుండి వెళ్ళు.

"ఘూ, ఘూ, ఊఁహూఁ" అని ఆ పాడుపిట్ట ధూత్కరించును.

నా చుట్టు నిరాశ అలముకొనినది.
కిటికీనుండి గుడ్లగూబ కదలదు.

'ఘూ, ఘూ' అను నిరంతర ధూత్కారము."

కేశవసుత్ షాజహాను నిర్మించిన మయూరాసనమును, తాజమహాలును సరిపోల్చి, వైభవ ప్రదర్శనముకంటె ప్రేమ శ్రేష్ఠమని నిరూపించును.

13 నవంబరు 1892 న వ్రాసిన ఆ ఖండికలో భావమిట్టిది:

"ఆ చక్రవర్తి రెండు ఉత్తమ కృతులు చేసెను.

ఒకటి మయూరాసనము-దానిమీద ఆ సీనుడై అతడు శోభిల్లెను—దాని కయిన కర్చు ఆరుకోట్లు—రాజులు చేతులు జోడించుకొని దాని ముందు నిల్చువారు. తమ తల లతని గుప్పిటిలో నున్నవను తలంపు కలుగగనేవారు గజగజలాడు చుండిరి.

గంభీర యమునానదీ తీరమున, తన ప్రియురాలికొరకు మూడు కోట్లు వెచ్చించి అతడొక ప్రేమమందిరము కట్టించెను.

చోరులు సింహాసనము నెత్తుకపోయిరి. ఇంకను నిలిచియున్న ఆ అద్భుత భవనము అందరి జ్ఞాపకములలో మెదలుచున్నది.

మత్తభ్రాంతనరుడా! నీ కృతుల పర్యవసానమిట్లే, సదా గుర్తుంచుకొనుము; స్వార్థప్రకృతికి ఎంత ధూపము వేసినను పొగ ప్రపంచమునుండియే మాయమగును. ప్రేమకొరకు ఒక సన్నని అగరుబత్తి వెలిగింతువేని దాని సౌరభము ప్రపంచమంతట వ్యాపించి, నీకు తుష్టి కలిగించును.

స్త్రీ యెడ తనకు గల శారీరకాకర్షణను వ్యక్తము చేయుటకు అతడు సంకోచింపడు. కేశవసుత్‌కు ముందు మరాఠీ కవితలో గల అంగాంగ వర్ణన ధ్వనిమయము-అలంకారాచ్ఛాదితము—లేదా అశ్లీలమును, వాచ్యమును. సున్నితమును, సుకుమారమునగు శైలిని ప్రవేశపెట్టి దూరాన నున్న ప్రేయసిని స్మరించుచు అతడు వ్రాసిన కవితలు అధునాతన మరాఠీ కవితలో తొలుత పేర్కొన దగిన ఉత్తమ ప్రణయ కవితలు. ఇట్టి కవితలకు కేశవసుత్ యుగకర్త.

## సమాజ వ్యవస్థపై తిరుగుబాటు

27 వ మార్చి 1966 వ సంవత్సరమున ముంబాయి మరాఠీ గ్రంథ సంగ్రహాలయలో ఉపన్యసించుచు శ్రీమతి చారుశీల గుప్తే. "కేశవసుత్ "నవాసిపాయి." 'తుతారీ' 'స్ఫూర్తి' అను కవితలు మూటిని మించి ఇంకేమియు వ్రాసియుండకున్నను అతడు అమరుడయి యుండు వాడు." అని నుడివెను. ఆ మూడు కవితలు నవ్య మహారాష్ట్రకు మూడు వేదముల వంటివని ఆమె అభిప్రాయము. ఆ మూడు కవితల అనువాదము చివర ఈయబడినది. నిజమునకు ఆ కవితలు మూడును శక్తివంతములైనవి. మరాఠీ కవితలో అంతకు పూర్వము లేని విప్లవ భావ సమన్వితము లవి. కేశవసుత్‌లో నిక్షిప్తమై, సమస్త కృత్రిమ సంప్రదాయములను, త్రుప్పుపట్టిన ఆచారములను ఎదిరించుటకు సమర్థమై, నిత్యజాగృతమై యున్న మానవతావాదము ఆ కవితల వలన వెల్లడి యగుచున్నది. మానవునకు, మానవునకు నడుమ కులమతముల ననుసరించిన విభేదమునకు అతడు విరోధి. అతని సాధన ఎంత మహత్తరమైనదో అంతకు ముందున్న స్థితిగతులను చారిత్రకముగా పరిశీలించుట వలన తెలియగలదు.

కేశవసుత్ 1867 వ సంవత్సరమున జన్మించెను. అనగా బ్రిటిష్ ప్రభుత్వమునకు విరుద్ధముగా భారతదేశమున సాగిన ప్రథమ స్వాతంత్ర్యసమరము తరువాత పది సంవత్సరముల కతడు జన్మించెను. బ్రిటిష్ ప్రభుత్వము భగవత్ప్రసాదమని భారతీయులు విశ్వసించు కాలము గడచిపోయెను. దాస్య పీడితులగు ప్రజలను జాగ్రత్తపరచుటకై మహారాష్ట్రమంతట అనేకములగు ఉద్యమములు మొదలైనవి. విద్యాభ్యాసమునకై కేశవసుత్ పూనాకు వెళ్ళినపుడు, "నాదేశము," "నామతము, "నా భాష' అను నినాదములు నలువైపుల మారుమ్రోగుచుండెను. ఇదంతయు, నిర్మాణదశలో నున్న అతని బుద్ధిని ప్రభావితము చేసెను. అతని దేశభక్తి కవిత

లన్నియు 1890 కి పూర్వము వ్రాయబడినవే. ఆ తరువాత అతని జీవితములో కాని, రచనలలో కాని రాజకీయములతో ఎట్టి సంబంధము కనిపించదు. ఆ కాలపు కవులను, మేధావులును చరిత్రనాధారముగా చేసికొని తీవ్రమగు జాతీయవాదమును ప్రకటించు చుండిరి. వారిలో పలువురు దివ్యమైన గతమునకు చెందిన స్వచ్ఛయశమును గానము చేసిరి. కేశవసుత్ ఇట్టి గతమును త్రవ్వుకొను ఆత్మవంచనకు పాల్పడ డయ్యెను. కాని సమాజములోని అసమానతల వలన వ్యథచెంది, దానిని ఏ విధముగనైనను రూపుమాపుటకుగళమెత్తెను.

అతనిని విప్లవవాద కవి అనుటలోను, ఉత్క్రాంతివాద కవి అనుటలోను మరాఠీ విమర్శకులకు అభిప్రాయభేదము కలదు. కొందరు అతడు తన కాలమునకు చాల ముందున్నవాడని తలతురు. మరి కొందరు అతడు "ప్రగతి పథగాముల గుంపులో చేరినవాడు కాని పథనిర్దేశకుడు కా"డని భావింతురు. (పట్వర్ధన్) ఇంక కొందరతనిని కేవల సంస్కర్తయందురు. తన కవితలలో సర్వమానవ, సమానత్వమును, సౌభ్రాతృత్వమును, స్వాతంత్ర్యమును ప్రవచించినప్పటికిని రాజకీయ కవి మాత్రము కాడతడు. సమాజమును ప్రభావితము చేయుటలో కవిగా తన వాక్కు దుర్బలమైనదని అత డెరుగును. గాన తన సమకాలిక పరిస్థితులపట్ల ఉదాసీనత వహించెను.

సమాజముపట్ల నితనికి గల విప్లవభావము బెత్తములేనిచో పిల్లలు చెడిపోదురను విశ్వాసము గల లోపభూయిష్ఠ విద్యావిధానమును విమర్శించుటతో ప్రారంభమయ్యెను. "ములాస్ ఝోడ్ పణాచ్యా ఏకావంతోస్" (పిల్లలను దండించు పంతులు) అను 'శిక్షక గళ్లి, ఏప్రిల్ 1889 లో రచితమైన ఖండికలో కేశవసుత్ దుష్టోపాధ్యాయునిపై ఇట్లు ఆగ్రహించెను;

> "క్రూరుడా! ఏమూర్ఖుడు నీకీ ఉపాధ్యాయ వృత్తినిచ్చినాడు?
> నీవు కటికవానివృత్తినెందుకు అవలంబింపవు? నీకదియేతగినవృత్తి"
> ఈ కుఱ్ఱవాని వింత నిర్దాక్షిణ్యముగా దండించుచుంటివేల?
> వీడేమిపాపము చేసెనో చెప్పుము?"

పాఠశాలలను, ఉపాధ్యాయులను గురించి కటువైన అనుభవ మతనిది. కనుక తీవ్రముగా ఆ విధానమును ప్రతిఘటించెను.

అతడు ఆనాటి భారతదేశ పరిస్థితుల నవగాహన చేసికొని యుండెను. 1888 లో రచించిన "ఏకా భారతీయాచే ఉద్గార్" (ఒక భారతీయుని పలుకులు) అను కవితలో తన ఆవేదన నిట్లు వెల్లడించెను ;

" సూర్యుడుదయించి పైకి ప్రాకునట్లు ఒకప్పుడు
మాభాగ్య సూర్యుడు చాలపైకి ప్రాకలేదా ? చెప్పుము
ఈ దిశను విడిచి ఇప్పుడు పశ్చిమమును రమించుచున్నాడు
క్షీణత కారు చీకటై ఆక్రమించి మమ్ము బాధించుచున్నది.
లతలారా! ఈ సుందర పుష్పములతో మాకేమి సంబంధము ?
విహంగములారా! మీ పాటలు మధురమైనవే-కాని మాకేమి
సంబంధము ?

పరతంత్రుల మగు మాకు చూచుటకు కనులు లేవు.
పరతంత్రుల మగు మాకు వినుటకు చెవులు లేవు "

ఈ దీర్ఘ కవిత నిటులే వ్రాసి వ్రాసి ఇట్లు ముగించెను :

" ఓ దేవా! ఈ దాస్యపు చీకటి రాత్రి ఎప్పుడు అంతరించును ?
స్వాతంత్ర్య భానూదయము మరల ఎప్పుడగును ?
ఈ పంజరమునుండి ఎప్పుడు విడివడుదుము దేవా !
మా జాతికి మరల పూర్వ వైభవ మెపుడు లభించును ?"

తన ఆకాంక్ష డెబ్బదియొక సంవత్సరములు గడిచిన తరువాత నిజమగునని కవి యెఱుగడు.

ఇంకొక కవిత పల్లె సీమ గుణములను, నిరాడంబరతను అభివర్ణించు చున్నది. పాశ్చాత్య భోగభాగ్యములపట్ల లాలస పనికి రాదని హెచ్చరించుచు కల దానితో తృప్తిపడుట యందలి సుఖమును ఉగ్గడించుచున్నది. 'ఏక్ ఖేదే' అను శీర్షికతో 1887 లో వ్రాయబడిన ఈ కవితనుండి కొన్ని పంక్తు లివి :

ఇవి చిన్న చిన్న గుడిసెలు కాని
సుందర సౌధములు కావు
సౌధములలో రోగములు కాపుర ముండును,
గుడిసెలలో ఎట్లుండ గలవు ?
రోగము సుకుమార మైనది.
అది పరుపులపై పవళింపగోరును,
పూరి గుడిసెలో ముతుక గొంగడిపై ఎట్లుండ నేర్చును ?
ఈ చిన్నపల్లెలో, ఈ పూరిగుడిసెలలో
సత్ కృషీవలులు నివసింతురు,

వారు చేలలో కష్టింతురు,
సరళ, నిరాడంబర జీవితము గడపుదురు.
ఇట్టి చోట నాకొక పూరిగుడిసె యుండెనేని
నేను అర్థహీనుడ ననిపించుకోను ;
విద్యాధికుడ కాననిపించుకోను ;
కీర్తి కై ప్రాకులాడను.
కీర్తి యన నేమి ?
ప్రజల తలలపై తురాయిగా చేరిన పక్షియీక.
పక్షి తూటా దెబ్బతిని పడిపోయిన తరువాతగదా
లభిస్తుంది ఆ యీక.
అదయినా ఒకనాడు రాలిపోయేదే.
అతిధు లెవరైన దూరప్రాంతము నుండి వచ్చినపుడు
వారు చెప్పు కథలు అచ్చెరువు పడి వినెదను.
"ఈ ప్రపంచము అంత విశాలమా ? అంత గొప్పదా ?
అంత లేపి భోగ భాగ్యములు ఉండునా ?"
అని ఆశ్చర్యము ప్రకటించను.
ప్రపంచ భాగ్యముతో నా భాగ్యమును పోల్చి చూడను.
స్వర్గ వైభవమును లెక్కించుచు
ప్రపంచము తన గమనము మానుకొనునా ?"

ఈ కవితలో, "The Deserted Village" లోని రామణీయకము గలదు. "Prelude" లోని సారళ్యము గలదు. గాంభీర్యము గలదు.

ఆధునిక యుగమున మహారాష్ట్రమందలి సాంస్కృతిక పునరుజ్జీవమునకు మూలకారణములను వివరించుచు శ్రీ దినకర్ కేశవ్ బేడ్కర్ ఇట్లు వ్రాసెను: "రానడేకును, ఆ గర్కర్‌కును ముఖ్యమగు వ్యత్యాస మొకటి కలదు. ఆ గర్కర్‌కు ప్రకృతి పట్లగల తీవ్రకవితావేశము పురాతన అద్యతన మేధావు లెవ్వరును గుర్తింపవిది, రానడే కూడ దాని నెరుగడు. కేశవసుత్‌కు ప్రకృతి పట్లగల ప్రగాఢమును, ఉత్తేజకరమును అగు అనురాగము, బాలకవి (1889-1918) కి గల ఇతోధి కానురాగము, మహారాష్ట్రీయమగు తాత్త్విక జిజ్ఞాసనరయుటలో ముఖ్యముగా గమనింపదగిన అంశము. ఆ గర్కర్ వ్రాసిన "ప్రకృతి దర్శనము" అను

వ్యాసమును శ్రద్ధగా పరిశీలింతుమేని అందు అనేక విషయములు కనిపించును." (జి. బి. సర్దార్ సంపాదకత్వమున వెలువడిన "మహారాష్ట్రజీవన్" పుట 60)

ఒక విధముగా "గ్రామసీమకు కదలండి" అనెడి గాంధీజీ సందేశమున కిదంతయు నాంది. ఇదియే టాగూర్ వ్రాసిన 'మాతిర్‌డాక్ 'లో విశదీకరింపబడినది. తన సుప్రసిద్ధ కవితలో, "నేను ఈ ప్రపంచపు కోలాహలముచే విసిగితిని. ప్రశాంత మగు పల్లెసీమకు వెళ్ళదలచితిని" అని హాలీ అనుటయు నిదియే. ఈ శతాబ్దపు ప్రథమ దశకములో కవులందరును ఉపశాంతిని, ఆధ్యాత్మికానందమును కలుగ జేయు వివిక్త ప్రదేశమును అన్వేషించిరి. దీనిని కాల్పనిక పలాయన వాద మన నచ్చును. అయినను, "Ends and Means" అను రచనలో ఆల్డస్ హక్స్లే అని నట్లు, "ప్రతి పలాయనమును ఒక పరిపూర్ణతయే."

భూస్వామ్య వ్యవస్థ పతనమునకు, నగర వ్యవస్థస్థాపనకు జరుగుచున్న ప్రోద్బలము లన్నిటిని కేశవసుత్ గమనించు చుండెను. అతడు వ్రాసిన 'తుతారీ' అను కవితకు సంబంధించిన వ్రాతప్రతులను శ్రద్ధగా పరిశీలింతుమేని ఒక వింత సంగతి స్పష్టపడును. మొదటి చిత్తుప్రతిలో స్త్రీ విద్య, బాల్యవివాహనిరసనము, విధవల కేశముండనముపై ఆక్షేపణ, విధవా వివాహసమర్థన, అస్పృశ్యతా నివారణ మున్నగు అంశములు సూటిగా ప్రస్తావింప బడినవి. రెండవ ప్రతిలో అవన్నియు తొలగింప బడినవి. ఆ కవిత వాస్తవికమై, నీతిబోధకమై యొప్పుచున్నది. సంస్కరణోద్దిష్టమగు పద్యమయ వ్యాసము కాలేదు ఆ కవిత. బి.ఎస్. పండిట్ వ్రాసినట్లు, "కేశవసుత్ చిత్రించిన కార్మికుడు "ఎట్టికామ్రేడ్" కాడు 1880 లో అతడా కవిత వ్రాసినప్పుడు భారతీయులకు కారల్ మార్క్స్ పరిచయమే లేదు." సాంఘిక వ్యవస్థపై తిరుగుబాటు ధోరణిలో అతడు వ్రాసిన కవితలలో తన దేశము అన్ని రంగములలో పురోగమింప వలెనను ఆకాంక్ష స్పష్టమగును. మూలతః అతడు కావ్యరసనిష్ఠితమైన చిత్తవృత్తి కలవాడు. అయినను ప్రజాస్వామ్యములో ఒక డుగా అక్రమ వ్యవస్థ నెదిరించు తన బాధ్యతను మరచినవాడు కాడు. దేశాభి మాన ప్రేరితుడై అన్యదూషణమును, అవ్యక్తవాదమును అతడు చేపట్ట కుండుట శ్లాఘనీయమైన విషయము. కేవల జాతీయ కవిత వ్రాసియుండిన అతనికి ఇతోధిక ప్రజాదరణ, సంఘములో సమున్నతస్థానము లభించి యుండెడిది. ఆ యుబలాటము నణచుకొని తన చిత్తవృత్తి కనుకూలమగు కవితా కళ నారాధించి ధన్యుడయ్యెను.

కేశవసుత్ పాశ్చాత్య సాహిత్యమునుండి లిరిక్కు, ఓడు, సానెటు మొదలగు ఛందములను గ్రహించుటయే కాక తన కవితలో Reading the face లేదా What man has made of man వంటి ఆంగ్ల పదబంధములను, లోకోక్తులను అనువదించెను. అతడు వ్రాసిన మొత్తము నూట ముప్పది రెండు కవితలలో ఇరువదియైదు అనువాదములు; నాలుగు సంస్కృతమునుండి, మిగిలినవి ఆంగ్లమునుండి అనూదితములు.

సంస్కృతానువాదములలో కేశవసుత్ ఎట్టి మౌలికత కాని ఉపజ్ఞకాని కనబరచలేదు. అవి పద్యమునకు పద్యముగా అనువదింపబడినవి. రఘువంశ సప్తమ సర్గలోని ఐదు మొదలు పన్నెండు శ్లోకముల ననువధించుటతో అతడు తన కవితా రచనకు శ్రీకారము చుట్టెను. అంతకు పూర్వమే గణేశ్ శాస్త్రి లెలే రఘువంశమును సమగ్రముగా అనువదించి యుండెను. కేశవసుత్ మూలములోని సూక్ష్మాంశములు కొన్ని వదలి లేని కొన్ని మాటలు చేర్చెను. భారవి కిరాతార్జునీయము ప్రథమ సర్గలోని ఇరువదియారు శ్లోకములను గూడ అతడు అనువదించెను. ఈ యనువాదము మొదటిదానికంటె మెరుగు. సంస్కృతములోని మరి రెండు కవితల నతడనువదించెను. అందులో ఒకటి ఒకింత హాస్యరసస్ఫోరకము.

ఆంగ్లానువాదములో ఆరు సానెటులు – అవి యివి;

1. 'Doth then the world go thus,' } విలియమ్ డ్రమండ్.
2. 'The Lessons of Nature' }
3. Work — శ్రీమతి ఇ. బి. బ్రౌనింగ్.
4. Blind Love }
5. Since Brass, nor stone } విలియమ్ షేక్స్పియర్
6. Post Mortem }

అతడనువదించిన ఇతరాంగ్ల కవిత లివి;

'The Death bed' థామస్ హుడ్, 'Dream with in a Dream ఎడ్గార్ అలెన్‌పో, 'The Apology' ఎమర్సన్, 'Jock of Hazeldean' స్కాట్, 'Cupid and Canpospe' జాన్ లిలి, 'Randean' లేహంట్ – ఇతర యూరోపియ కవుల కవితలు మూడు ఆంగ్లమునుండి అను వదించెను. అవి. 'A little Rose on the Heath' గెథే; The Butter flies as white as Snow

'Napoleon le Petit' విక్టర్ హ్యూగో (ఇవి రెండును తోరూ దత్త ఆంగ్లములో అనువదించిన ఫ్రెంచి కవితలు.)

ఇవి కాక ఇంక మూడు దీర్ఘ కవితలు, అను వాదములు కావు కాని ఈ క్రింద నుదాహరింప బడిన ఆంగ్ల కవితల ననుసరించి వ్రాసినవి; 'The old clock on the Stairs' ఎచ్-డబ్ల్యూ-లాంగ్‌ఫెల్లో, 'Raven' ఇ-ఎ-పో, 'Alexander's Feast or The power of Music' జాన్ డ్రైడన్. ఈ యనుసరణలలో-మూలమునందలి భావము, ఇతి వృత్తము అట్లే యున్నవి కాని ఛందమును, వాతావరణ కల్పనయు పూర్తిగా మార్పు చెందినవి.

డా. మాధవరావ్ పట్వర్ధన్, ప్రొ. జోగ్‌వంటి విమర్శకులు ఈ అనువాదము లన్నియు సర్వోత్తమ మైనవి కావనియు, వీనిలో నేక సూత్రత లోపించినదనియు నభిప్రాయ పడిరి. విశ్వజనీనతను, ఉదాత్తతనువలచి మరాఠీ కవిత పాశ్చాత్య భావనల వలన ఎట్లు ప్రభావితమయ్యెనో, అన్యదేశ్యములగు ఛందోరీతులు మరాఠీలో ఎట్లు స్వీకరించబడెనో, తెల్పుటకే ఈ అనువాదములు తోడ్పడును.

మరాఠీ సాహిత్యములో కేశవసుత్ సానెటును ప్రవేశపెట్టిన ఉదంతము ఆసక్తికరమైనది. మరాఠీలో 'మయూరాసన్-ఆణి-తాజ్ మహల్' అను సానెటును అతడు 13 వ నవంబర్ 1892 లో వ్రాసెను. ఆ తొలిసానెటు 13 వ మే 1893 నాటి 'కర్మణుక్' పత్రికలో ప్రచురిత మయ్యెను. ఆదిలో దానిని చతుర్దశక్ లేదా చతుర్దశపది అని పిలిచెను. తర్వాత సానెట్ అనెను. 'దుర్మభ్‌లేలా' అను కవిత కూడ సానెట్‌వంటి రచనయే. అయితే అందు పదునాల్గు కాక పదునారు పాదములు కలవు. కేశవసుత్ షేక్స్పియర్, మిల్టనుల సానెటుల లక్షణమును వాని వాని అంత్యప్రాస నియమముల ననుసరించి పాటించెను. మొదట అతడు మొదటి పన్నెండు పంక్తుల నొక మాత్రాచ్ఛందమునను, చివరి రెండు పంక్తుల నొక మాత్రాచ్ఛందమునను వ్రాసెను. తరువాత అన్ని పంక్తులను ఒకే మాత్రాచ్ఛందమున వ్రాయ దొడగెను.

ఇట్లు, ఈ అనువాదములవలన కేశవసుత్ విశాలదృక్పథమును, ఉదార బుద్ధియు వెల్లడియగును. అతడు పాశ్చాత్య కవితారీతిని, ఛందోరీతులను అను సరించుటకు, అవలంబించుటకు నిస్సంకోచముగా నుండుటకు తూగెను. మరాఠీలో ఇట్లు ప్రవేశించిన సానెటు రానురాను మరాఠీ ఛందోరీతులలో ఒకటిగా స్థిరపడెను. కేశవసుత్ తరువాత పలువురు కవులు సానెటులు వ్రాసిరి. కొందరు లఘు కావ్యము

లను, వీరగాథలను గూడ సానెటు శైలిలో రచించిరి ఓడ్, సానెట్‌వంటి పాశ్చాత్య ఛందోరీతులు, 'సైక్-లార్క్' వంటి రూపకాద్యలంకార శోభితములైన గేయములు మరాఠీలో చోటు చేసికొని, ఇంతటి ప్రజాదరణకు పాత్రము లగునట్లు చేసిన కీర్తి కేశవసుత్‌కు దక్కినది. ఈ శైలికి అతడే మార్గదర్శకుడు. అతడు అభిమానమును, అభిరుచిని పురస్కరించుకొని ప్రారంభించిన ఆంగ్ల ఛందోరీతుల అనుసరణ రానురాను అభినివేశముగా, ఆచారముగా మారినది.

## క్రొత్త తెన్నులు

భాషలోగాని, ఛందోరీతులలోగాని, రచనా శిల్పమునగాని విజయవంతముగా నూత్నప్రయోగములు చేసిన వారే గొప్ప కవులుగా పరిగణింప బడుదురు. కేశవసుత్ సాహిత్యమున కావించిన నూత్నప్రయోగములను ప్రొఫెసర్ జోగ్ ఒక అధ్యాయమంతయు సమీక్షించెను. అతని అభిప్రాయము ప్రకారము, కేశవసుత్ అక్షరగణములకంటె మాత్రాగణములయెడ మక్కువ చూపెను. రెండు లేక నాలుగు పాదములలో పద్యములల్లు ప్రాత సంప్రదాయము నతిక్రమించి, అతడు, ఐదు, ఆరు, ఏడుపాదముల పద్యములల్లెను. ఒకే పద్యములో కొన్ని పాదములు పొడుగుగను కొన్ని పొట్టిగను కూర్చెను. హిందీలో ప్రయుక్తమగు దోహా ఛందమును మధ్య యుగపు కవి మోరోపంత్ గ్రహించి యుండెను. దానిని కేశవసుత్ వరకు ఇంకెవరును తాకలేదు. కేశవసుత్ వచన గేయమునకు దగ్గరగా ఉండు కవిత చెప్పెను. కాని ముక్తచ్ఛందమును మాత్రము ముట్టలేదు.

కేశవసుత్‌కు పూర్వము కొన్ని ప్రత్యేక భావములు వ్యక్తీకరించుటకు కొన్ని ప్రత్యేక ఛందోరీతు లెన్నుకొను సంప్రదాయముండెను కేశవసుత్ ఆ సంప్రదాయ మును విరసించి, అతః పూర్వము సాధారణముగా భక్తికి, లేదా మతవేదాంతము లకు ఉద్దిష్టములగు ఛందోరీతులను సంఘ సంస్కరణకు సంబంధించిన వాస్తవిక భావవ్యక్తీకరణకు ఉపయోగించెను. సంస్కృత వృత్తములను స్వేచ్ఛగా జాతులుగా మార్చెను. అనగా త్ర్యక్షరగణములను గురులఘువుల వ్యత్యాసముచే మాత్రా గణములుగా మార్చి వ్రాసెను. కొన్ని 'లిరుక్కు' లలో మాత్రాసామ్యమును కూడ వదలి కొన్ని పాదములను పల్లవిగా మాటి మాటికి ఆ వృత్తము చేసెను. భావాను గుణముగా కొన్నిపాదములను సాగదీసెను. అంత్య ప్రాసలలోను క్రొత్త ప్రయోగములు చేసెను. 'తుతారీ' (బాకా) 'ఘూబడ్' (ఉలూకము) 'జప్సర్జా' మొదలగు కవితలలో మొదటి మూడు పాదములకొక అంత్యప్రాసమును, చివరి

దీర్ఘపాదమునకు వేరొక అంత్యప్రాసమును నియమించి వ్రాసెను. ఆధుని కాంగ్ల కవులవలె కేవల స్వర సంబంధము గల అంత్యప్రాసలను కూడ అతడు స్వీకరించెను. సాంప్రదాయికముగా ద్విపదలకు ఒకే అంత్యప్రాసనియమమున్నను అతడు పారసీ సంప్రదాయము ననుసరించి మొదటి పాదముల కొకటియు, రెండవ పాదములకు వేరొకటియు అంత్యప్రాసనియమము పాటించెను.

కేశవసుత్ ప్రయత్న పూర్వకముగా కవితలో నూత్నప్రయోగములు చేసెనని సారాంశము. గ్రుడ్డిగా పాశ్చాత్యుల ననుకరించుటకే అత డిట్లు చేయలేదు. సాంప్రదాయిక ఛందోనిబంధనలు స్వేచ్ఛగా భావవ్యక్తీకరణ చేయుటకు ఆటంకముల నిగ్రహించి చేసెను. ఈ విధముగా అతడు మరాఠీ కవితకు క్రొత్తతెన్నులు వేసెను. తర్వాతి కవులు తదను గమనమున సుదీర్ఘములగు ఓడులను, లిరిక్కులను వ్రాసిరి. గజలులలోవలె సరిపంక్తులకును, బేసి పంక్తులకును అంత్యప్రాసనియమము పరిపాటి యైనది. 'రవి కిరణ మండలి'కి చెందిన కవులీ పద్ధతికి ప్రాచుర్యము కలుగజేసిరి.

మాధవరావ్ పట్వర్ధన్ కేశవసుత్‌ను శబ్దప్రయోగమునకే అధిక ప్రాముఖ్యము నిచ్చిన కవి యని విమర్శించినాడు ఈ విమర్శ నిజమునకు ప్రశంసయే. శబ్దముల సహాయమున కవులు, అన్యులకు అసాధ్యమగు దానిని సాధింతురు. కవులకు గల మంత్రశక్తియే శబ్దప్రయోగము. శబ్దాశ్రయ కవిత అనువాద సాధ్యము కాదు. కేశవసుత్ కవితలు కొన్ని కేవల శబ్దాశ్రయములే అయినను, అతడు ఆ శబ్దములకు సానబెట్టి, పుటముదు తొలిచి, నూత్నార్థ ప్రతిపాదకములుగా దిద్ది తీర్చుటకు పలు ప్రయత్నము చేసెను. ఈ విధముగా అతడుకవితలో నూత్నపథ ప్రదర్శకు డయ్యెను.

## విమర్శాత్మక పరిశీలనము

కేశవసుత్ భావతీవ్రత గల కవి. హాస్యరస విముఖుడు. అయినను ఇతరులలోని హాస్యము నాస్వాదింపగల రసజ్ఞతలేని వాడనుటకు వీలు లేదు. 'బోల్కో' వ్రాసిన కవితకు అతడు దొనరించిన ఈ అనువాదమందుకు దృష్టాంతము:

> "ఈ లోకము మూర్ఖులమయము,
> మూర్ఖుని చూడ దలచనివాడు
> తలుపులు కిటికీలు మూసికొనిన చాలదు,

తాను ముఖము చూచుకొను అద్దమును పగులగొట్టుకోవలె."

'రాష్ట్రవాణి'లో సంకలనము చేయబడిన తన వ్యాసము (మార్చి, ఏప్రిల్ 1966, పుట 354) నందు ప్రొ. ఎస్. కె. క్షీరసాగర్ ఇట్లు వ్రాసెను:

"కేశవసుత్ సామాన్య మహారాష్ట్రజనుని ఆరాధ్య లక్ష్యమును మార్చి నాడు, అంతకు పూర్వము అతడు పండరీపురమును విరోబాను గురించి ఆవేదన పొందువాడు; లేదా, మృతవీరులను, గతవ్యథలను తలచి దుఃఖించువాడు. ప్రాచీన కవులు రాముని గురించి, కృష్ణుని గురించి వ్రాసిరి. లేదా, ఈశ్వర జిజ్ఞాసను, అది తథ్యమయినను విద్య అయినను, ప్రకటించిరి. సామాన్యుని నిత్య జీవితము కవితా వస్తువు కాలేదు. పాశ్చాత్య కవుల ననుసరించి కొందరు కవులట్టి ప్రయత్నము చేసిరి. కాని, అట్టివారిలో ప్రతిభకంటె ప్రయత్నమే అధికముగా కనుపట్టును. స్ఫుట భావములతో వైవిధ్యము గల వాస్తవ కవిత వ్రాసిన మొదటి కవి కేశవ సుతే అనుటకు సందేహము లేదు."

ఎమ్. టి. పట్వర్ధన్ మొదలగు విమర్శకులు కొందరు కేశవసుత్ కవితలో అసహజత, అస్పష్టత, అవాస్తవికత, దూరాన్వయము మున్నగు కావ్యదోషములు చూచిరి. అతని తొలినాళ్ల కవితలో పరిణతి లేనందున కొంత అవాస్త వికతలేక పోలేదు. అంతమాత్రమున అతని సమస్త కవితను విమర్శకు గురిచేయుట సరికాదు. అతడు బడి పంతులుగా పనిచేసిన వాడనియు, అంతగా విద్యావంతుడు కాడనియు కొందరు చేయు వ్యక్తి గత విమర్శ విలువ కట్ట దగినది కాదు. అతడు పఠితకు తన్మయత కలిగించడనియు, తన మరాఠీలో ఆంగ్ల పదజాలము విరివిగా చొప్పించి క్రొత్త పలుకు బళ్లను సృష్టించి నాడనియు, నిరాశా వాది యనియు శ్రీ తాల్కే చేసిన విమర్శకూడా అట్టిదే. ఇట్టి విమర్శలు అతని కవితా సంకలన మంతటికిని వర్తించునవి కావు. ప్రొ. ఆర్. ఎస్. జోగ్, 'కేశవ సుత్' అను తన రచనలోని చివరి అధ్యాయమున ఇట్టి విమర్శకులకు సవివరముగా సమాధానము లిచ్చి, ఈ విమర్శలన్నియు వ్యక్తిగత ద్వేష జనితములని సయుక్తికముగా నిరూపించియున్నాడు.

అతని కవితలో ప్రకటితమైన నిగూఢ జిజ్ఞాసను, అనంతత్వము మీది అభిమానమును ప్రస్తావించని యెడల అతని కవితపై విమర్శాత్మక పరిశీలనము సమగ్రము కాదు. ఒకరీతిగా అతడు అనుభవవాది; కనుక అతని కవితలలో దేవీదేవతల ప్రసక్తి కాన్పించదు. అయినప్పటికిని ఆధ్యాత్మిక జిజ్ఞాస అతని కవిత్వ మంతటను

అంతర్వాహినిగా గోచరించును. దీనికి కారణము బ్రహ్మ సమాజ, ప్రార్థనా సమాజముల ప్రభావ మనుటకు సందియము లేదు. ఈ ద్విశప్రభావము మరాఠీలో క్రొత్త. బుద్ధుని కారుణిక వాదమును కలుపుకొని మానవ విష్ఠిత సామ్య సిద్ధాంతమును ప్రతిపాదించుచు నొక నూత్న మానవతా వాదమునకు కేశవసుత్ కవిత్వరూపము నొసగెను. కవిత యిక ధర్మనిష్ఠితమును, ప్రభునిష్ఠితమును కాదు. వర్తమాన నిష్ఠితమయినది. అయినను ఆయన కవిత చేరవలసిన గమ్యమునే చేరుకొన్నది. స్వీయ విషాద వలయము నుండి విడివడి దూరస్థ విషయాసక్తమైనందుననే కేశవసుత్ కవిత శ్రేష్ఠమును, విశ్వజనీనమును అయినది.

కేశవసుత్ ముఖ్య లక్షణములలో శిశు సహజమైన అమాయికత చెప్పుకొనవలసినది. అతడు కావించిన శిశుస్వభావ వర్ణన ఆహ్లాదకరము. తన చుట్టుగల క్రౌర్యము, నిర్దాక్షిణ్యత అతనికి తెలియనివి కావు. అయినను అతడు నిరాశ చెందడు. అతని సౌందర్య సంభావన స్థిరము; శాశ్వతము. ప్రేమతో మృత్యువును, కరుణతో క్రౌర్యమును అతడు జత చేయడు, కాళ్ళక్రింద పచ్చిక కప్పిన భూమిని, నెత్తిమీద నీలా కాశమును ప్రేమించుటతప్ప అన్యమేదియు అతడు కోరడు. తనవ్యక్తిగత వ్యధలను, దురదృష్టమును నిందింపడు. పరుల దుఃఖమునకు బాధ పడును.

కీ. శే కుసుమావతీ దేశపాండే అభిప్రాయము నిచట ఉదాహరించు ఉబలాటము నణచుకొనలేను - ఆమే యిట్లనును: "కేశవసుత్ కావ్యసృష్టికి సంబంధించిన సమస్యలను గురించి ఆలోచన చేసెను. కావ్య రచనోత్సుకమగు తన చిత్తవృత్తిని మెలకువగా గమనించెను చౌక బారుగా, అసభ్యముగా చేయబడు నిత్య వ్యవహారము వలన నలిగి, పులుముడువడి, అర్థపుష్టిని కోల్పోయిన శబ్దములకై విచారించెను కావ్య ప్రయోజనమును గురించియు, భావమును ప్రఫుల్లము చేయురీతిని గురించియు, చింతన చేసెను. అతని మొత్తము నూట ముప్పదిరెండు కవితలలో ఇరువది ఇట్టి విషయములకు సంబంధించినవే. ఆధునిక మరాఠీ కవులలో ఈ సమస్యలను గురించి యోచించి, వానికి కావ్యత్వము కలిగించిన ప్రథమకవి అతడే. ఛంద శ్శిల్పమున నూత్న ప్రయోగములు చేయుటలో మార్గదర్శకు డతడే. సంస్కృత వృత్తములను స్వీకరించి వాని పాదక్రమమునకు పరివర్తనము కలిగించిన వాడతడు. సాంప్రదాయికమగు నాల్గు పాదముల పద్ధతిని మార్చి ఎన్నియో క్రొత్తరీతులు ప్రవేశపెట్టిన వాడతడు. అతని కవిత్వమంతయు

ఒక చిన్నపాటి సంకలనమున సర్దుకొనినది. దానిపై విమర్శ, వివాదమొక పెద్ద గ్రంథమైనది. పలురకముల విమర్శలతో, పలువుర అభిప్రాయములతో కేశవసుత్ కవిత సంకలన రూపము చెందుట సమంజసము - అతని కవితకు రాజ్వాడే, రాహాల్కర్ మున్నగు సహృదయులు, సానుభూతిపరులు నగు విమర్శకులు కొందరు లభించినారు. కొందరు అతని అవ్యుత్పన్నతను, అపరిణతకావ్య శిల్పమును చులకన చేసినారు. కొందరి దృష్టిలో అతడు స్వార్థపరుడు, విషాదపరుడు, మిథ్యావేశపరుడు. ఏది ఏమైనను కేశవసుత్ కవిత తన గుణమును మాటిమాటికి ఋజువు పరచుకొనుచునే యున్నది. అతని ఉత్తమ కవితాశక్తి స్వచ్ఛమగు మౌలికత, గాఢావేదన, సర్వ జనామోదయోగ్య మైనవి. అతడు ఆధునిక మరాఠీ కవితకు జన్మదాతయనుట నిర్ధారితము. జీవితము పట్ల స్వీయానుభూతుల వ్యక్తీకరణ, సత్య కథనమున మొకమోటమిలేని తనము, సామాజిక వ్యవస్థను గురించిన అనుపేక్షభావము, మార్మికత, ఇత్యాది లక్షణ సమన్వితమగు ఆత్మాశ్రయవృత్తి అతనినుండియే వెలువడినది - ఆధునిక మరాఠీ కవిత్వపు శైలిపట్లను, విషయము పట్లను చెలరేగిన విప్లవమునకు అతడే ఊటబుగ్గ."

అతని కవిత యెట్టిదో తెలుపుటకై కొన్ని సుప్రసిద్ధ కవితల భావానువాదము ఈ చివరి పుటలలో నొసగబడినది. ఈ పుటల రచయితకు తనశక్తి యెంతటిదో తెలియును. కవితా రచన కెట్టిసాధన చేసిన వాడునుకాడు. అయినను కేశవసుత్‌ను గురించి బొత్తిగా తెలియని వారికి ఈ భావానువాదము కొంతవరకు తోడ్పడగలదను ఆశకలదు. ఈ ముందరి పుటలు కవితగా కాక, డెబ్బదియేండ్ల క్రిందట ఒకానొక వ్యక్తి, ఉన్నత విద్యాది సదవకాశములు లేకున్నప్పటికిని, కేవల ప్రతిభాబలమున నేమి సాధించెనో తెలుపునట్టి ఋజువు పత్రముగా భావింపదగును. ఆనాటి చారిత్రక పరిస్థితులను దృష్టియందుంచుకొని వీనిని చదువుట ఉచితము.

# న వ సై ని కు డు

నవ్యయుగపు, నవచైతన్యం గల
నవ సైనికుణ్ణినేను: ఎవరాపగలరు నన్ను?
బ్రాహ్మణ్ణీకాను, హిందువునుకాను, ఏజాతివాణ్ణీకాను.
విశ్వమంతా వ్యాపించివున్న పతితుల్లో నేను.

నా ఆకలి అపరిమితం
రాష్ట్రాలు దాన్ని పోకార్చలేవు.
కూపస్థ మండూ కాన్నికాను,
నా ప్రపంచానికి అవధులులేవు - ఎవరాపగలరునన్ను?

సర్వత్రా నా సహోదరులే,
సర్వత్రా నాగృహ చిహ్నాలే
ఎటువెళ్ళినా, క్రింద పచ్చని భూభాగం,
ఎటువెళ్ళినా, మీద నీలాకాశం.
నీడలో మిసమిసలాడే పిల్లలు
ఎండలో సుందర పుష్పాలు.
అంతా హృదయానంద కరం.

వాళ్ళందరూ నావాళ్ళు. నేను వాళ్ళవాణ్ణి
మా అందరిలో ఒకే చైతన్యస్రవంతి
నవ్యయుగపు, నవ చైతన్యంగల
నవసైనికున్ని నేను, ఎవరిని ఆరాధింతును?

నేను,
విశ్వమంతటిని నాలో దర్శిస్తాను
విశ్వాన్ని ఆరాధిస్తాను
నన్ను నేను ఆరాధించు కుంటాను

అభిమానంలేక, అనర్థాలు నెత్తిన రుద్దుకునే
వాళ్లకు నేనుకాను.

చిన్నలో, పెద్దలో, నాకుతెలియదు.
మంచి, చెడు - తారతమ్యంలేదు.
దూరం, దగ్గర - ఈ భేదంలేదు.

అంతాగొప్ప, మంచి, దగ్గర - అంతటానేను
హల్వా[1]లో నూవు గింజమీద చక్కెరపాకం,
అలాగే అహం స్ఫూర్తిచుట్టూ జడత్వపు పొరలు,
లోన నిర్గుణ తిలం - పైన సగుణవేష్టనం
అన్యులను గిల్లటానికి ముళ్లు

ఇలాటి స్థితిలో,
కలహ కారణం ఎలా తొలగుతుంది?
ఇదే నా విచారం.

కాలం, శాంతి సామ్రాజ్యస్థాపన కోరుతుంది,
తత్స్థాపనకై అవతరించిన ప్రవక్తను,
నవ సైనికుణ్ణి నేను.

8 మార్చి 1898

## హరిజన బాలకుని తొలిప్రశ్న

అంటరాని వాళ్ళ బీద బాలకులు
ఉల్లాసంగా, బాటప్రక్కన ఆడుతున్నారు.
దూరాన్నుండి ఒక బ్రాహ్మణుడు వచ్చాడు
"బాటప్రక్కన ఏమి ఆట?
బ్రాహ్మణునికి దారియిచ్చి
తొలగి పొండి, అస్పృశ్యుల్లారా!" అని గదిమాడు.

---

[1]హల్వా. సంక్రాంతి సందర్భమున మహారాష్ట్రులు నూలపై ముళ్లు ముళ్లుగా చక్కెర పాకంపట్టి తయారుచేయు ఒకదినుసు మిఠాయి.

ఎవడు నిలుస్తాడు? అంతా పారిపోయారు.
ఒక్కడుమాత్రం సాహసంచేసి అక్కడే నిలిచాడు.
దుష్ట బ్రాహ్మణుడు, చేతికఱ్ఱను జలిపించాడు.
"గాడిదా! నీనీడ నామీద పడరాదు.
పారిపో - లేదా ? దీనితో వడ్డిస్తా." ఉరిమాడు.
ఇంటికి జారుకున్నాడు ఆ బాలుడున్నూ.
"నా నీడ అతనిపై పడితే ఏమిటి ? ఏమికీడు
మూడుతుంది?" అని ఆలోచిస్తూ -
తన తల్లిని ప్రశ్నించాడు.

ఆపేద తల్లి అన్నది.
"మనం నీచులం. వాళ్లు అధికులు
వాళ్లు కనిపిస్తే మనమే దూరం తప్పుకోవలె."
ఇది అమాయికపు జవాబు -
ఎన్ని పాపాలుచేస్తే, ఎందరిని అణచి అవమానిస్తే
ఆధిక్యత వస్తుందో ఆమెకేమి తెలుసు, పాపం!

3 సెప్టెంబర్ 1888

## మూ ర్తి భం జ నం

విగ్రహాలు పగల గొట్టండి- త్వరపడండి
విగ్రహాలు విరగ గొట్టండి;
లోపలి ధనాన్ని పట్టుకోండి.
పూజాద్రవ్యాలు సమర్పించుటం ఎందుకు ?
ముక్కు నేలకు రాయుట మెందుకు ?

మేము ఆటవికులం, సంస్కార హీనులం,
మాకు కావలసింది ధనమే!

మంత్ర కత్తె ప్రశ్నవేస్తుంది-
సమాధానం చెప్పకుంటే మ్రింగివేస్తుంది.

దాని ఉచ్చులో పడగూడదు.
జాగ్రత్త - జాగ్రత్త.
విగ్రహాలను విరగ గొడదాం.
ముక్కల్ని మళ్లీ అతికిద్దాం.

కాని వాటిని అమ్మగూడదు.
దేవతల్ని అమ్మేవాళ్ల జారజులు.
దొంగలు వాళ్లే - మేం కాం

(చివరి కవిత)

## ప స్తు లుం డే కూ లీ

సూర్యదేవుడు పశ్చిమం చేరాడు
అస్తమయం రంగులవల్ల శోభిస్తున్నది.
అంతటా ఆనందం. ఉత్సాహం
నాలోనే దుఃఖం నిండివున్నదెందుకు ?

దినమంతా వ్యర్థంగా ప్రయాసపడ్డాను.
చిల్లి గవ్వయినా దొరకలేదు.
కడుపు నింపుకోవటానికి కూలీ చేస్తాను :
నేడెవరూ నన్ను కూలీకి పిలువరు.

ఈ సుందర సౌధాలన్నీ
నా తండ్రి నిర్మించినవి కావా ?
ఆ సౌధాల్లో సంపన్నులు సంతోషంతో నర్తిస్తున్నారు.
నేనేమో ఆకలితో చస్తున్నాను.

వాళ్ల సౌఖ్యాలకు ఈర్ష్యపడను
ఒక ఎండు రొట్టె చాలు నాకు.
దేవుడా! నేను పరిశ్రమిస్తూ చావటానికి సిద్ధం.
ఆకలితో చంపుతా వెందుకు?

ప్రభువా! నీ దృష్టిలో అంతా సమానమైతే
బీదలయెడ నీకు దయలేదెందుకు?
కొందరికి పంచభక్ష్య పరమాన్నా లిస్తావు?
నాకు ఎండు రొట్టయినా ఈయవు?

ముక్కున గడ్డిపరకలతో తమ పిల్లలకోసం,
గూళ్లకు వెళ్లుతున్నాయి పక్షులు ఉల్లాసంగా-
వాటిని చూపి నా భార్య పిల్లలను ఓదారుస్తుంది:

"పక్షులు తమ పిల్లల మేత ముక్కున చెక్కుకొని
గూళ్లకు వెళ్లుతున్నాయి చూచారా!
తినటాని కేదైనా పట్టుకొని
మీ నాయన అలాగే వస్తాడు ఏడవకండి."

"ఓ ప్రియురాలా! ఓ పిల్లల్లారా!
మీకు నా ముఖ మెలా చూపేది?
నేనీ భూమి మీది కెందుకు వచ్చాను?
పుట్టినప్పుడే ఎందుకు చావలేదు నేను?

జనవరి 1889

## స్ఫూర్తి

పాత్రనిండార నింపు, నురుగు పొంగి పొరలనీ,
త్రాగుతూవుంటే సృష్టి నిమిషాని కొకరంగు మారుస్తున్నట్లుంది.

ఎప్పుడూ వదురుతూ వుండటం నుదిటిమీద వ్రాసివుంది;
త్రాగుబోతులంటుంది లోకం: విచారమెందుకు?
ఈ తీక్ష్ణమద్యం వలన, నాలుక కట్లుత్రెంచుకొని ఆడుతుంది.
దీని ఉష్ణం వలన భూమీ స్వర్గమూ కరిగి కలిసి పోతవి.

కైపు చెంది ఏదైనా ఆలోచించు,
నీ యిష్టం వచ్చిందల్లా ఆలాపించు
ఆ శబ్దాలు విని, ఆచార దాసులు ఉడికి పోతారు
పాత్ర నిండార నింపు, నురుగులు: పొంగి పొరలనీ,

వేదకాలపు ఋషులు సోమరసంకాచారు,
దాని శేషం పిసాసువులమైన మాకు త్వరగా ఇయ్యి.
వివేకమా! ఔచిత్య చర్చ అనవసరం,
వెళ్లిపో: దురవస్థ చుట్టుముట్టినవాళ్లం మేము
అందుకే త్రాగుతాము.

ఊహా నౌకల్లో,
ఆకాశ సముద్రానికి అడ్డంగా పయనిస్తాము.
నక్షత్ర రత్నాలన్నీ యేరి, పేద భూమిపై పారవేస్తాము
దేవతలు అడ్డగిస్తే, ఎదిరించి యుద్ధం చేస్తాము
ఆవంతయినా ఓటమిని ఒప్పుకోము-
దేవదానవులను మానవుడే సృష్టించాడని
లోకులు గ్రహింతురు గాక!
పాత్ర నిండార నింపు, నురుగులు పొంగి పొరలనీ

నాచేతికి కవిత్వమనే లోహదండ మిచ్చింది విధి
దాన్ని ప్రజల నెత్తులపై మోపి ప్రపంచాన్ని తలక్రిందు చేస్తాము
విప్లవ ధ్వజం ఎత్తి, అల్లకల్లోలం రేపి
అన్యాయాన్ని ముక్కలు ముక్కలుగా చెండుతాము-
మా చుట్టూ గాలిలో నిండి, "మహాదేవ! హరహర!"
అనే యుద్ధ వినాదాలు చెవుల్లో మ్రోగుతూ వుంటవి,
విశ్రమించినవాళ్లు చస్తారు, లేవండి నడుం కట్టండి.

చంపండి, లేదా పోరుతూ చావండి.
సత్యోత్థానాన్ని జనమంతా ఆహ్వానించండి.
మా ఉచ్ఛృంఖల విధానానికి చకిత జగతి కదలి పోవు.
పాత్ర నిండారనింపు, మరుగు పొంగి పొరలనీ—

23 మే 1896

## ఎక్కడికి?

"ఎక్కడికి?"
చక్కెర తేవటానికి—
ఫలానా పంతులుగారికి పుత్రోదయమయింది;
పంచిపెట్టటానికి బస్తాలకొద్ది చక్కెర అవసరం—"

"ఎక్కడికి?"
"పూలు తేవటానికి—
ఫలానా రావుగారింట పెళ్లి-
హారాలకు పూలవసరం-"

"నీ వెక్కడికి?"
"బాజారుకు—
క్రొత్త సంసారం ప్రారంభం—
మా ఆవిడ ఎదురుచూస్తూ వుంటుంది—"

"ఎక్కడికయ్యా?"
"వైద్యునికోసం—
ముసలాయనకు విషమించింది-"
"వెళ్లు, ప్రేతవస్త్రం తెచ్చుకో,
అంతిమ సంస్కారానికి అన్నీ సమకూర్చు-"

ఒక శవాన్ని పట్టుకవెళ్లుతున్నారు.
" నీ ప్రయాణ మెక్కడికయ్యా ! "
గాలి లోంచి వచ్చినట్లు మాటలు వినవచ్చాయి.
" ఎక్కడికో నాకు తెలియదు. "

12 జూన్ 1889

## దు ర్ము ఖి

(తరగతిలో ఉపాధ్యాయుడొకడు నన్ను దుర్ముఖి అన్నాడు -
అప్పుడు నేననుకున్నాను:)

"గురువుగారూ! నాముఖం శుష్కమైనదే.
చూచిన వాళ్ళంతా విచారిస్తారు.
ఇది అందరికీ తెలుసు. కాని మీ రెందుకిలా అన్నారు ?
ఇలాఅంటే మీకేమి ఒరిగింది?

"వీడి ముఖం వికృతమైనప్పటికీ, విద్యావశాన
లోకాన్నీ లోకుల్నీ ఆహ్లాదపరిచే కవిత వీడు వ్రాస్తాడు."
ఈ సరళభావన విద్యా సంస్కృతులుగల మీ మస్తిష్కంలో
క్షణకాలం కలిగితే ఎంత బాగుండును!

గురువుగారూ! మీరు చీమలని ఎవరిననుకుంటున్నారో
వాళ్లు ఒకనాడు పక్షుల్లాగా ఆకాశంమీదికి ఎగిరి పోగలరు.
బూడిద కుప్పల్లా కనిపించేవాటి అట్టడుగున
నిప్పు కణములుండి ప్రపంచాన్నంతటినీ బూడిద చేయవచ్చు -
ఎవరు చెప్పగలరు?

ఈ నావికృత వదనం నుండి నిత్యానంద దాయకమైన
సుందర వాక్ప్రవాహం వెలువడవచ్చు ముందు ముందు;

మీరు కాకుంటే, మీ సంతానం తత్పానంవలన
తృప్తి పొందగలరు.
అప్పు డెవ్వరూ, "కవి ముఖం ఎలా వుండెనో?" అని
ప్రశ్నించరు,

1886

## సృష్టి - కవి

మిత్రమా! ప్రకృతి మృదు మధుర స్వరంతో
గానం చేస్తూ వుండగా, దాని ముందు, సామాన్య మానవుణ్ని
నేనేమని పాడను ?

శ్రుతి శుభగాలైన పక్షికూజితాలను
ప్రకృతి సృష్టిస్తూ వుంటే
నీరస కవితల్ని నేనెందుకు కూర్చను ?
వర్షాల మిషతో ప్రకృతి రోదిస్తూంటే

కరుణరసాత్మక కవిత ఇంకే కవి చెప్పగలడు ?
ప్రశాంత రాత్రుల్లో ప్రకృతి నిశ్వాసలు విడుస్తూవుంటే
అందులో శ్రుతి కలిపి ఏకవి తీర్పుని గుడించగలడు ?

అక్టోబర్ 1886

## కొన్ని చెదురు పంక్తులు

ప్రపంచమెంత పెద్దది ?
మనిషి బుద్ధి అంత

* * *

సృజన కేంద్రమేది ?
అందరి హృదయంలో

*  *  *  *

మనం మన జన్మదాతలం కాము -
పశ్చాత్తాప మెందుకు ?
కనుల్లో అశ్రువు లెందుకు ?
ఒకనాడు మరణిస్తాము

*  *  *  *

పాఠశాలలో బోధింపబడిన దానికంతటికీ
ఒక అధస్సూచిక:
"మధ్యమ పురుషలో ఉన్నదంతా ఉపయోగించు.
ఉత్తమ పురుషైక వచనాన్ని ముట్టకు-"

*  *  *

నీ దుఃఖ పాత్రను
కనులు మూసుకొని త్రాగు -
అడుగు మడ్డినంతటిని
ప్రపంచంమీద పారజల్లు -
ఒకని తిక్తానుభవం
ఇంకొకనికి అమృతం కావచ్చు -

1898

## ఆదిలో ఆకలి దప్పులు లేవు

ఆదిలో ఆకలి లేదు, దప్పికలేదు.
అన్నమూ, నోరూ ఒకేచోట వుండె.
కామ విషయం దూరస్థం కాదు.

స్త్రీ పురుషుల కొకటే శరీరం -
అప్పుడు అవయవాలు లేవు, కాళ్ళులేవు, చేతులు లేవు.
వాటి అవసరం గూడా లేదు.

భూమీ స్వర్గమూ ఒకటే,
అప్పుడు విచారంలేదు, దుఃఖం లేదు.

1898

## మే మెవరం ?

'ఎవరు?' అని ఎందు కడగటం ?
మేమంతా ఈశ్వరుని ప్రేమ పాత్రులం.
ఈ విశాల పృథ్విని మాకు ఆడుకోవటాని కిచ్చాడతడు.
స్వశక్తితో విశ్వంలో స్వచ్ఛందంగా విహరిస్తాం -
లో చూపుతో దిక్కాలాలగుండా చూస్తాం -
ఈ ఉపకరణాలు, ఈ ఆడంబరం, మా ముందు పేలవం
మా స్పర్శవల్లనే వస్తువులు శోభిస్తాయి -
మా చేతుల కలాటి మంత్రశక్తి వున్నది.
నీ తాలు తప్పలు చెరుగు - మేం గింజ లేరుతాం -
ఈ అవకాశంలో దేవతల నివాసాలు కల్పించిన వాళ్లెవరు ?
ఈ భూమిని స్వర్గంలా మార్చటానికి యత్నించిందెవరు ?
అమృతం కురిపే కృతులు నిర్మించింది మేమే
మీ కింతటి మంగళకరమైన ఆశ్రయం కల్పించింది మేమే.
మమ్ము విడిస్తే - నక్షత్ర మండలం కాంతి విహీనం-
మమ్ము విడిస్తే - జీవితం గవ్వకు కొరగాదు.

29 నవంబర్ 1901

## తుత్తారి (బాకా)

నా కొక బాకా తెచ్చి ఇమ్మ.
ప్రాణ వాయువులతో దాన్ని ఊదుతాను.
దాని తీవ్ర నాదంతో
ఆకాశాలన్నీ బ్రద్దలు చేస్తాను.
నాకొక బాకా తెచ్చి యిమ్మ

నేటిదాక శూన్యావకాశంలో
మూగవోయి వున్న ప్రతిధ్వనులకు
వాచాలత్వం కలిగిస్తాను. గట్టిగా ఊది;
అలాటి బాకా నాకెవరు తెచ్చి యిస్తారు?

సారంగి. సితారు. షహనాయి.
వీణా వేణు మృదంగం.
ఏదైనా నాకేమి పని?
నాకొక బాకా తెచ్చి యిమ్మ.

ఆచారాల, అన్యాయాల సంతానమైన
భయంకర రాక్షస బాలకులు
నిన్ను చీల్చి చెండాడుతారు
ఈ విషాద సమయం ఉత్సవాలకు అనుకూలమా?
నీ మనస్సును ప్రశ్నించుకో;
బాకా శబ్దానికి హెచ్చరిక పడు;

మేఘాలు క్రమ్ముకున్నందున
సూర్యకిరణాలు దాగుకున్నవి
మామిడి పూతపై పురుగు పట్టింది
అయినా లోకం ప్రమత్తంగానే వున్నది.
ఆశ్చర్యమా? "పురాణాలూ. ప్రాచీన గ్రంథాలు

సుందరమైనవి, ఉత్తమమైనవి, మధురమైనవి
ఆధునిక మైనదంతా అబద్ధం."
అంటారే బొజ్జలున్న మూర్ఖులు,

వాళ్ళకు ధిక్కారం -
ప్రాచీన ఆకాశాలపై
నవీన నక్షత్రాలు,
ప్రాచీనమైన భూమి మీద
నవ్యమైన పచ్చిక,
ప్రాచీన సాగరాలలో
నవీన రత్నములు
ప్రాచీనత లోంచి ఉద్భవించే నవ్యత
శ్రేయస్కరం కాదా ?

ప్రాత చావనీ,
దాన్ని పాతిపెట్టు, లేదా దహనం చేయి,
భవిష్యత్తు పిలుపు విను,
ఒకరితో ఒకరు చెట్టా పట్టాలు పట్టుకొని
నడవండి.
వర్తమాన మొక మహోన్నత పర్వతం,
అందులో అందమైన గుహలు తొలవండి.

ఆ రాళ్ళమీద మీ పేళ్ళు చెక్కండి,
"ఊరికే కూర్చుండి కొవ్వు పెంచుకుంటా రెందుకు ?
ఏదో ఘనకార్యం సాధించండి
ప్రాచీనులు తమకు తోచింది చెపుతారు,
అదంతా అలవోకగా, సాదరంగా వినండి,

సంశయం వీడి ముందుకు సాగండి.
అనుజ్ఞగొని ఎప్పుడూ సిద్ధంగా వుండండి.
సృష్టి కనికరం లేనిది, అదెవరినీ సరుకు చేయదు,
ఎవరికోసము ఎదురు చూడదు _ ఎందుకైనా నిలువదు.

కాలంతో దాని క్రీడ ఎంత భీతావహం!
మహా పర్వతాలనది ధూళి చేస్తుంది.

దాని సవాలు స్వీకరించు; ఎదిరిస్తూ, పోరాడుతూ.
గోపురాలు ఉన్నతంగా లేవు.
పాడుపడిన కొంపల్లో కూర్చొని
పిరికి పందల్లా ఏడుస్తారెందుకు ? పిల్లలా ?
యాచించటం పురుషలక్షణమా ?

సంఘశక్తి పునాదులను
పూర్వాచారం చీలికలు చేసి పగుళ్లు లేపింది;
నిస్స్వార్థ ప్రేమతో దాన్ని నింపి, నిర్మించవలె.

జీవితం అసిధార.
విధవలూ, దిక్కులేని పిల్లలూ ఏడ్వనీ.
శతాబ్దాల తరబడివున్న పాపాల్ని
మీరక్తంతో తుడిచివేయవలె.
సిగ్గుపడకండి - పౌరుషహీనులు కాకండి.

పేరుమాసిపోయే పరిస్థితివస్తే
గొఱ్ఱెల్లా మేదకులైనారెందుకు మీరు ?
వెనుకాడకండి, తొట్రుపడకండి
ధీరులు కష్టాల్లో ఉత్సాహం పొందుతారు.

ధర్మ శాస్త్రాలు వల్లిస్తూ
నీతిని కూల్చివేస్తున్నారు.
నీతి నిలిచిన చోటనే
ధర్మం సుస్థిరంగా వుంటుందన్న విషయం
ఈ మూర్ఖులు విస్మరించారు.

దంభాన్ని, విరోధాన్ని ఎదిరించటానికి
వీరుల్లారా ! త్వరగా రండి.
సమానత్వ పతాకాన్ని ఎత్తండి.

సర్వత్రా నీతిని చాటి చెప్పండి;
ఈ బాకాధ్వనితో శ్రుతికలిపి.

నియమాలు మనుషుల కోసం,
మనిషి నియమాలకోసం కాదు.
అభ్యుదయాన్ని అటకాయిస్తే
అలాటి నియమాల్ని ఆవలికి నెట్టండి.
మీ నూత్న శక్తిని ప్రదర్శించండి.

ఘాతుక ప్రతి బంధకాలపై
దండెత్తండి, తరలిరండి.
వీరుల్లారా! "హర హర!" అంటూ
ఆవేశంతో, ఆగ్రహంతో
అభ్యుదయ పతాకాన్ని ఎత్తండి.
పురాణ యుగంనుండి నేటిదాకా
దేవ దానవులు ఘోరంగా పోరాడుతున్నారు.
ప్రస్తుత కాలంలో దానవులంతా
దేవతలపై దూకుతూ, తమ పతాకలెత్తుతున్నారు.
దేవతల సహాయార్థం, వెళ్దాం పదండి.

28 మార్చి 1893

రుషుర్జా

(మహాత్ములు శూన్యము నుండియే లోకకల్యాణ సామగ్రిని ఆవిష్కరించిరి. ఆ మహాత్ముల స్థితిని దృష్టియందుంచుకొని ఈ గీతమును చదివినచో ఇది దుర్బోధము కాదనుకొనెద - కేశవసుత్.)

ఖేద మోదములు లేవు,
హాసం అంతరించింది,
ముళ్ళశయ్య, ముళ్ళురాలి పట్టుపాన్పులా మృదువైంది.

కనుల ముందేదీలేదు,
కాంతిలేదు. చీకటిలేదు,
ఇలాటి స్థితినేమనవలె?
"జపుర్జా! ఓ ప్రియ జపుర్జా!"

భేదమోదములు కలవాళ్ళంతా
ఏమి అర్థం చేసుకుంటారు?
ఏమి ఆచరిస్తారు?
అలాటి వాళ్లు మమ్ము పరిహసించినా
ఇలా అనటానికి మేము వెనుకాడము;
పిచ్చివాళ్ళనబడే వాళ్ళకు
అర్థహీనతలో ఎంతో అర్థం గోచరిస్తుంది.
ఆ అర్థం ఇచ్చే శబ్దాలేవి?
"జపుర్జా! ఓ ప్రియ జపుర్జా!"

చిద్ఘన చపల,
జ్ఞాతం అనే కంచెను దాటి,
ధీరతతో, ఎగసి, ఎగురుతూ
అక్కడ ప్రకాశిస్తుంది;
మసక మసక ఆకారాలు కన్పిస్తవి,
అవి, నిగూఢార్థం గల పాటలు పాడుతవి,
ఆ పాటల ధ్వని యిది:
"జపుర్జా! ఓ ప్రియ జపుర్జా!"

సాగుచేయని భూమి చాలావున్నదక్కడ,
సాగుచేసే అధికారం గల కర్షకుడెవరు? చెప్పు.

---

1 ఈ శీర్షిక అర్థరహితము – శూన్యము – మరాఠీ బాలికలు "జిమ్మా" అను ఆట ఆడుదురు. ఆంధ్రబాలికల 'చెమ్మ – చెక్క' వంటి ఆట అది. ఆడు నప్పుడు బాలికలు తల ఎగురవైచుచు, చప్పట్లు చరచుచు, "జా–వోరీ–జా" అనుచు ఆ లయలో తన్మయులై గిర గిర తిరుగుదురు దాని వికృతి. జపుర్జా, లేక ఝుపుర్జా—

వేలలో ఒకడు.
అక్కడినుంచి వనమూలితె స్తే
అటకాయించే వాళ్ళు లేరు ;
ఈ మంత్రం ఉచ్చరిస్తూ వెళ్ళితేచాలు :
"జపుర్జా ! ఓ ప్రియ జపుర్జా !"

పురుషునితో నిత్యప్రకృతి
క్రీడిస్తూ వుంటుందక్కడ-
ఆ క్రీడల స్వరసంయోగాన్ని అర్థం చేసికోవటం
జ్ఞానహేతువు : వారి సౌందర్యం
హృదయ విదితం-
ప్రేమభావంతో పాడు మరి,
"జపుర్జా ! ఓ ప్రియ జపుర్జా !"

సూర్యుడు, చంద్రుడు, తారకలు,
ప్రేమ నృత్యం చేస్తూ వుంటాయి :
అచటికి వెళ్ళవలె ననుకుంటే
విస్పంగుడవుకా, గిరగిర తిరుగుతూ
ఆడుతూ, పాడుతూ అంటూ వుండు :
"జపుర్జా ! ఓ ప్రియ జపుర్జా !"

2 జూలై 1893

సంవృత ద్వారమైన మిత్రగృహమును చూచినప్పుడు.

నా మిత్రుడిక్కడ ఉండేవాడు,
మిత్రుల కోసమే బ్రతికే వాడు,
పాశాలన్నీ త్రెంపుకోజూచాడు,
"స్వదేశం" తోనే తనను బంధించుకున్నాడు.

బంధనాలు లేనిదేదీ లేదిక్కడ.
ప్రతిదీ, దేనితోనో బంధితమై వున్నది-
ఈ సుందర తారకలు కట్టుత్రెంపుకుంటే
వాటి కాంతి లుప్తమైపోతుంది.
చంద్రుడు ఎప్పుడూ భూమిని అనుసరించి
సూర్యున్ని సేవిస్తాడెందుకు?
సాధ్యమైతే స్వతంత్రంగా సూర్యున్ని సేవించనీ.

నా మిత్రుడు భార్యతో బంధం త్రెంపుకొని
దేశాన్ని సేవించ వెళ్ళాడు.
నా మిత్రుడు నగరాంతరం వెళ్ళాడు
అతనింటికి తాళం-

ఇక్కడ మేము తరుచు సంభాషించుకున్నాం.
ఔను, సంభాషించుకున్నాం, చదువుకున్నాం.
ఇక్కడ నాటిన మా స్నేహబీజం,
స్నేహ వల్లిగా వృద్ధిచెందింది.
దేశాన్ని గురించి మాట్లాడుతూ,
నిద్రను మరచి, గంటల తరబడి కూర్చున్నాం.
ఇద్దరి నిట్టూర్పులొకటైనవి,
ఇద్దరి కన్నీళ్ళు కలిసి పారినవి.

భూపాల రాగం ఆలపించేంతవరకు,
పక్షుల పాటలతోపాటు శీతల మంద పవనం
వీచేంతవరకు,
కాంతి తన ప్రభావంచే చీకట్లను తరిమేవరకు
మేము కూర్చుండేవాళ్ళం రాత్రుల్లో-

అప్పుడు మేమనుకున్నాం: ఈ అవమాన కరమైన
దాస్యపురాత్రి ఎప్పుడు అంతరిస్తుంది?
స్వాతంత్ర్యప్రభాతం ఎప్పుడు? మంచిరోజు ఎప్పుడు?
దౌర్భాగ్యులం మనం, ఈ కన్నులతో
ప్రభాతం చూచే అదృష్టం మనకున్నదా?

ఆ ప్రభాతాన్ని త్వరగా తేవటానికి
ఈ చేతులతో మనమేమైన చేయగలిగింది ఉన్నదా ?

ఔ గాక ! ఇలాగామేము ఎన్నోప్రశ్నలు వేసుకునే వాళ్ళం-
ఖిన్నులమై ఒకరినొకరం ఇలా ఆశ్వాసించుకున్నాం :
"కోరికవున్నచోట మార్గం వుంటుంది."

మిత్రుడా ! ఎక్కడ వున్నావిప్పుడు ?
ఏమి చేస్తూవున్నావు ?
తన సర్వస్వాన్ని దేశంకోసం త్యాగంచేయటానికి
ఇంకెవరినైనా ప్రోత్సహిస్తున్నావా ?

మిత్రుడా ! నీ గది మూసివుండటం చూచి
నా హృదయం ఎడబాటు వలని దుఃఖాన్ని పొందుతున్నది.
మనం మళ్ళీ ఇక్కడే కలుసు కోగలమనే ఆశలు
అశ్రువులై కారి పోతున్నవి.

సాయంకాలం, ముకుళించిన కమలాన్ని చూచి,
"రేపు మిత్రుడు తన కరస్పర్శచే విప్పారజేస్తాడులెమ్మ"ని
భ్రమరం వెళ్ళిపోయినట్లే, మిత్రుడా !
నేనింటికి వెళ్ళిపోతున్నాను.

మే 1887

## మరాఠీలో కేశవసుత్ రచనలను, అతని గురించిన రచనలను సూచించు పట్టిక ;

శ్రీ గోపాల రామచంద్ర పరంజపే చే సంకలితము.
మహారాష్ట్ర ప్రభుత్వ సౌజన్య సంపాదితము.

కేశవసుత్ కవిత,

1. 'కేశవసుత్ యాంచీ కవితా' _ హరినారాయణ్ ఆప్టేచే సంకలితము, 1917.
2. 'కృష్ణాజీ కేశవ్ దామ్లే యాంచా కవితా సంగ్రహ వ చరిత్ర' సంపాదకుడు, సీతారామ్ కేశవ్‌దామ్లే.
3. 'కేశవ సుతాంచీ కవితా' (చతుర్థ ముద్రణము) సంపాదకుడు., పరశురామ్ చింతామణ్ దామ్లే 1938.
4. 'కేశవ సుతాంచీ కవితా' (పంచమముద్రణ) సంపాదకుడు పరశురామ్ చింతామణ్ దామ్లే 1949.
5. 'హరవలేశ్రేయ' సంపాదకుడు ఆర్. ఎస్. జోగ్ 1956.

కేశవసుత్‌ను గురించిన రచనలు, చెదురు వ్యాసములు.

6. 'కేశవసుత్ ఆనీ త్యాచీ కవితా' ఎన్. ఎస్. రాహల్కర్, 1919.
7. 'తుతారీచే పడసాద్' ఎస్. వి. వర్తక్, 1926.
8. 'కేశవసుత్' (కావ్యదర్శన్) ఆర్. ఎస్. జోగ్, 1947.
9. 'కేశవసుత్ చరిత్ర - చర్చా - అభ్యాస్'. సంత్; గాడ్గిల్.
10. 'కేశవసుత్ చరిత్ర విషయక్ టిప్పణి' ఎస్, కే. గార్గే "రత్నాకర్" ఫిబ్రవరి 1926
11. 'కేశవసుత్ చరిత్ర విషయక్ టిప్పణి.' ఎస్. కె. గార్గె "రత్నాకర్" నవంబర్, డిసంబర్ 1930.

12. "కేశవసుత్ చరిత్ర విషయక్ టిప్పణీ' ఎస్. కె. గార్గే. 'రత్నాకర్"
ఫిబ్రవరి 1931.

13. 'కేశవసుత్ - మృత్యులేఖ్ -' కావ్యరత్నావళి, డిసెంబర్ 1905.

14. 'కేశవసుత్ - చరిత్రలేఖన్.' కావ్యరత్నావళి నవంబర్ 1, 1917.

15. 'కేశవసుత్ - చరిత్రలేఖణ.' ఎస్. కె. దామలే, 'కేశవసుతాంచీ కవితా'
2, 3, 4 ముద్రణలు.

16. 'కేశవసుత్ - చరిత్ర లేఖ్' ఎస్ ఎచ్. అట్టారదే. యశ్వంత్ జనవరి 1945

17. 'కేశవసుత్ ఆణీ వినాయక్.' బి. జి. చిక్కోరర్. యశ్వంత్, ఏప్రిల్ 1945

18. 'మరాఠీ కావ్యాచీ ఉత్క్రాంతీ వ కేశవసుత్.' బి. ఏ భిడే. (కావ్యచర్చా)
పుట 204 - 219

19. 'కేశవసుత్ ఆణీ కవీచ్యా వ్యాపార్' ప్రొ. ఆర్. పి. సబ్నీస్ (కావ్యచర్చా)
పుట 220 - 227.

20. 'కేశవసుత్ - శ్రీ సాధూదాస్' కావ్యచర్చా పుట 228-231

21. 'కేశవసుత్ వటిశక్' ప్రొ. వి, జి. మాయాదేవ్. కావ్యచర్చా పుట.
232-246

22. 'కేశవసుత్' జి. టి. మాడ్ఖోల్కర్. ఆధునిక్ కవి పంచక్ పుట. 53-84

23. 'కేశవసుత్' జి. టి. మాడ్ఖోల్కర్. కావ్యవిచార్ పుట 1-14

24. 'కేశవసుత్ - గేల్యాసార్ వర్షాతీల్ మరాఠీ కవితా' జి టి. మాడ్ఖోల్కర్.
అర్వాచీన్ మరాఠీ సాహిత్య.

25. 'కేశవసుత్' ఆర్. ఎస్. జోగ్ 'అర్వాచీణ మరాఠీకావ్య పుట 40-57

26. 'కేశవసుత్' వి. ఎస్. సారావతే, మరాఠిసాహిత్య సమాలోచణ
పుట 213-223

27. 'కేశవసుత్' డి. ఎన్. షిఖరే, మరాఠీ చా పరిమల్ వాల్యూమ్ నం-2
పుట. 525-561.

28. 'కేశవసుత్' వి. పి. దాండేకర్. 'మరాఠీ సాహిత్యా చీరూపరేఖా'
ఉత్తరార్థ పు. 56-65.

29. 'కేశవసుత్' ఏ. ఎన్. దేశ్‌పాండే, ఆధునిక్ మరాఠీ వాఙ్మయాచా
ఇతిహాస్ భా. 1.

30. 'కేశవసుత్' బి. ఎస్. పండిత్, ఆధునిక్ మరాఠీ కవితా పు. 148

31. 'కేశవసుత్' మాధవరావ్ పట్వర్ధన్, అర్వాబీన్ మరాఠీ వాఙ్మయసేవక్ భా. 1. పు. 98—175.

32. 'కేశవ సుతాంచా కావ్య దృష్టింతీల్ ఉత్క్రాంతి'
33. 'నవ సిపాయీ' (రసగ్రహణ్)
34. 'అమ్హీకోణ' (రసగ్రహణ్)

కుసుమావతీ దేశపాండే, 'పాసంగ్' విమర్శాత్మక వ్యాసములు.

35. 'కేశవసుతాంచీ కవితా' వి. కే. రాజ్వాడే. మనోరంజన్ జూలై, సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్ 1920.

36. 'కేశవసుత్' ఏమ్. వి. రాజాధ్యక్ష (పంచకవి) సంపాదకుడు రాజాధ్యక్ష.

37. 'కేశవసుత్' డా. పి. డి. గుణె. మనోరంజన్, అక్టోబర్ 1917

38. 'జాపుర్జా ఆణీ మహతారీ' ఎస్. ఎమ్ వర్దే మనోరంజన్, జనవరి 1920.

39. 'కేశవసుతాంచీ రాష్ట్రీయ కవితా' ఎన్. ఏమ్. ఖిడె మనోరంజన్, నవంబర్ 1925

40. 'కేశవసుతాంచీ అంతరంగ్' వి. కె. అంబేకర్ మనోరంజన్, మార్చి 1918

41. 'కేశవసుత్ యాంచీ కవితా' ఎన్. ఎమ్. ఖిదే వివిధ్ జ్ఞాన్ విస్తార్ నం. 6 జూన్ 1919

42. 'కేశవ సుతాంబీ అభినవ కావ్యరచనా' ఆర్. కె. లాగూ. నవయుగ్, అక్టోబర్, నవంబరు 1921

43. 'కేశవ సుతాంచీ కవితా' వి. చీ. పట్వర్ధన్, రత్నాకర్ సెప్టెంబర్, 1919.

44. 'కేశవసుతాంచా సంప్రదాయ్' జి. టి. మాడ్ఖోల్కర్ నవయుగ్, జూలై 1919

45. 'తుతారీ వాఙ్మయ వ దసరా' వి. ఎస్. ఖాండేకర్, నవయుగ్, ఆగష్టు, సెప్టెంబర్ 1929

46. 'కేశవసుతాంచా పరంపరే విషయీకాహీఁ త్రోటక్ విచార్.' ప్రొ. ఎస్. బి. రాణడే. మహారాష్ట్ర సాహిత్య. ఆగష్టు, అక్టోబర్, 1923

47. 'కేశవసుత్' (కావ్య) ఆర్. ఎస్. జోగ్. ప్రదక్షిణ 1940

48. 'కేశవసుతాంచీ కవితా,' ప్రిన్సిపాల్ వి. బి. పట్వర్ధన్, రత్నాకర్, జనవరి 1926.

49. కేశవ సుతాంచీ కవితా' వి. కె. జాట్కో మనోరంజన్, డిసెంబర్, 1930.

50. 'కేశవసుతాంచ్యా కవితేచా అభ్యాస్' ఏ. ఎమ్. జోషి. సహ్యాద్రి, సెప్టెంబర్ 1940

51. 'కవీ కేశవసుత్ (ఏక్ బాజూ') ఎచ్. ఎస్ షెనోలికర్, ఫెర్గుసన్ కాలేజి మాగజైన్, సెప్టెంబర్, 1940.

52. 'నవ్యయుగాచా కావ్యప్రణేతా' ఏ. ఎస్, జోషి, ఫెర్గుసన్ కాలేజి మాగజైన్, ఫిబ్రవరి, 1941

53. 'అభిప్రాయ' (కేశవ సుతాంచీ కవితా) ఎన్. సి. కేల్కార్, 'కేశవ సుతాంచీ కవితా' (నాలగవ సంస్కారణ)

54. 'కేశవసుత్' ఎన్. కె. బిహెూరే, 'కేశవసుతాంచీ కవితా' నాలుగవముద్రణ.

55. 'కావ్య అణీ క్రాంతీ', ఏ. ఆర్. దేశపాండే, అభిరుచి, సెప్టెంబర్, అక్టోబర్ 1944.

56. 'కేశవసుతాంచీ కవితా' ఆచార్య భాగవత్. సత్యకథా ఫిబ్రవరి. 1948.

57. 'కేశవసుత్' లాల్జీ పాండ్యే, సత్యకథా. ఫిబ్రవరి. 1948.

58. 'కేశవసుత్' పి. పి. దాప్లే. యుగవాణీ. నవంబర్. 1947.

59. 'తుతారీచా పడసాద్' టి. ఎస్. కార్ఖానిస్. నవభారత్. జనవరి, 1951.

60. 'కేశవసుత్' (క్రాంతీ విచార్) డబ్ల్యూ. ఎల్. కులకర్ణి సాహిత్య. అక్టోబర్. 1949

61. 'కవిశ్రేష్ఠ కేశవసుత్' మనోహర్ దేశపాండే, రోహిణి, ఏప్రిల్, 1949

62. 'పున్హా కేశవసుత్' వసంత్ కానేట్కార్, సాహిత్య, మే, 1950

63. 'కేశవసుత్ ఆణీ తాంబే' ఎస్. కె. క్షీరసాగర్, సాహిత్య జూలై, 1950

64. 'కేశవసుతాంచా విసర్గ విషయక్ రహస్యవాద్' కె. ఎమ్. ఆరాధ్యే, యుగవాణి, జూలై, ఆగస్టు, 1948.

65. 'కేశవసుత్ ఆణీ సామాజిక్ క్రాంతీ' నాథ్ మాధవ్. వాఙ్మయ శోభ, ఫిబ్రవరి, 1951.

66. 'కేశవసుతాంచ్యా ఏకా కవితే గా ఇతిహాస్.' ఎస్. బి. రాణడే. సత్యకథా. అక్టోబర్, 1953.

67. 'కేశవసుతాంచ్యా వ్యక్తివాద్ ఆణీ వాస్తవాధిష్ఠిత్‌ధ్యేయవాద్' ఆర్. ఎస్. వాలింబే, లోకమాన్య, దీవాళీ నంబర్, 1954.

68. 'కేశవసుతాంచీ స్వప్నసృష్టి' శివరామ్ అత్తార్దే, యుగవాణి, ఆగస్టు, సెప్టెంబర్, అక్టోబర్, 1947, ఫిబ్రవరి, ఏప్రిల్, మే, 1948.

69. 'యుగప్రవర్తక్ కేశవసుత్' వి. ఏ. కులకర్ణి, బలవంత్, 23-11-55.

70. 'కేశవసుత్ స్మృతి దినా నిమిత్తానే' శిరీష్ అత్రే, నవయుగ్, 13-11-55

71. 'కేశవసుత్ ఆణీ మరాఠీ కావ్యాచీ పన్నాస్ వర్షే.' బి. పి. మొహాఱ్రిర్ యశ్వంత్, నవంబర్, 1955.

72. 'కేశవసుతాంచా పురోగామి దృష్టికోణ్.' ఏ. ఎస్. షేత్యే. దైనిక్ లోక మాన్య. 13-11-55

73. 'కేశవసుత్' ఆర్. ఎస్. వైద్య. దైనిక్ నవశక్తి, 7-11-55.

74. 'కేశవ సుతాంచీ తుతారీ' (నోట్స్) జి. బి. గ్రామోపాధ్యాయ్, చాంద్, సెప్టెంబర్, అక్టోబర్, 1955.

75. 'కేశవసుత్ కావ్యచర్చా' జూలై, సెప్టెంబర్, అక్టోబర్, ఉషా మూడవయేడు.

76. బాంధ్వలా కవి డి. డి. జావర్కర్, రోహిణీ, మార్చి, 1955.

నేషనల్ లైబ్రరీ, కలకత్తా సౌజన్య సంపాదితములై ఈ పొత్త మునకు ఆధార భూతములైన గ్రంథములు :

1. 'సమగ్ర కేశవసుత్' సంపాదకుడు ప్రొ. బి. ఎస్. పండిత్. ప్రకాశకులు, పీనస్ పబ్లిషర్స్, పూనా. మార్చి, 1918.

2. 'కేశవసుత్' రామచంద్ర శ్రీపద్ జోగ్. ప్రకాశకులు, కేశవ్‌భికాజీ ఢావళే, బొంబాయి 2, 1947.

3. 'కేశవసుత్, కావ్య ఆణీకళా' సంపాదకుడు వి. ఎస్. ఖాండేకర్. దేశముఖ్ ఆణీ కంపెనీ, 22 కస్బా పూనా 2, 1956.
4. 'జాపుర్జా సంపాదకుడు ప్రొ. వి. ఎమ్. కులకర్ణి మరియు ప్రొ. జి. ఎమ్ కులకర్ణి. ప్రకా, విదర్భా మరాఠ్వాడా బుక్ కంపెనీ, పూనా 2, 1963.

## కృతజ్ఞతా పూర్వక స్వీకృతి

1. రేడియోభాషణ (మరాఠీ) ఏ. ఆర్. దేశపాండే. కేశవసుత్ యొక్క ప్రణయ కవిత మరియు ఆధ్యాత్మిక కవితగురించి.
2. 'రాష్ట్రవాణి' పూనా. మార్చి. ఏప్రిల్. 1966. కేశవసుత్‌ను గురించి హిందీలో ప్రత్యేక సంచిక.
3. ఇంగ్లీషులో మరాఠీ సాహిత్య చరిత్ర వ్రాతప్రతి. రచన కే. శే. కుసుమావతీ దేశపాండే.